# DUKA PATTABHISHEKAMU.



By
Ch. Manikyasarma Garu.



Published by

**Karra Atchayya & Sons.**

Book-Sellers,

RAJAHMUNDRY.

 1927 (Price Re.0—12—0

# కన్యాశుల్కము.



ఇది ఆంధ్రభాషలో చక్కనిహాస్యరసప్రధానమగు నాటకము. దీనినిగురించి తెలియనివారును కొనియాడనివారునుండరు. దీనినిచాలా చోట్ల ప్రదర్శించియున్నారు. ఆంధ్రభాషలోనిట్టిగ్రంథము వేరొకటిలే దని చెప్పవచ్చును. కొలదిప్రతులుమాత్రమె ముద్రించితిమి. ఇందలి గిరీశముయొక్కమాటలు చర్యలు చదివిచూడవలసినదేకాని యిచ్చట వ్రాయుతరముకాదు. గ్రంథకర్త, శ్రీగురజాడఅప్పారావుపంతులుగారు.

వెల రు. 1—0—0



# రసపుత్రవిజయము.

చక్కనివీరరసప్రధానమయిననాటకము, అనేకచోట్లప్రదర్శించినది. కొలదిప్రతులుమాత్రమే ముద్రించియున్నాము. గ్రంథకర్త,

ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణశాస్త్రిగారు.

పోస్టేజీ వుచితము వెల రు. 1—0—౦.



# జ్ఞానకృష్ణలీల.

జ్ఞానముబోధించు చక్కనినాటకము. భగవద్గీతలోనిసంగతుల తోను నీతిబోధకమయినది. భీష్మనిర్యాణముకూడ యిందుగలదు.

గ్రంథకర్త, పండిత. కె. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

వెల రు. 1—4—0

**అరేబియన్‌నైటు** (చక్కనికథలు ( 1వ భా॥ క్యాలికోబైండు

వెల రు. 1—8—0

డిటో 2 వ భాగం రు. 1—8—0



## ఈనాటకమునందు వచ్చు పాత్రలు.

### పురుషులు.

దశరథుడు—కథానాయకుడగు రామునితండ్రి
విశ్వామిత్రుడు—ఒకఋషి
వశిష్ఠుడు—దశరథుని పురోహితుడు
సుమంత్రుడు—దశరథుని మంత్రి
రాముడు—కథానాయకుడు
లక్ష్మణుడు—రామునితమ్ముడు
మారీచుడు } తాటకపుత్రులగు రాక్షసులు.
సుబాహువు }
జనకుడు—మిధిలాపురరాజు.
శతానందుడు—అహల్యకుమారుడు
నక్షత్రికుడు—విశ్వామిత్రునిశిష్యుడు
పరశురాముడు—జమదగ్నిమహర్షికుమారుడు
భరతుడు—కైకకుమారుడు
శత్రుఘ్నుడు—లక్ష్మణునితమ్ముడు

### స్త్రీలు.

సీత—కథానాయిక
అహల్య—రాముడుశాపవిమోచనముచేసిన మునికాంత
కౌసల్య—రామునితల్లి
కైక—భరతునితల్లి
సుమిత్ర—లక్ష్మణశత్రుఘ్నులతల్లి
మంధర—కైకదాసి
ధాత్రిక—కౌసల్యదాసి
తాటక—మారీచసుబాహురాక్షసులతల్లి

(యింకను ప్రతీహారిసేవకుడు మొదలగువారు సందర్భానుసారముగావత్తురు.)



శ్రీ

# రామపాదుకాపట్టాభిషేకము.

## నాంది

శా. శ్రీకరముల్ సమస్తమునిసేవితముల్ దనుజాంతకంబుల
స్తోకమఖావనంబులు విదూరితగౌతమపత్నిశాపముల్
స్వీకృతజానకీకరకుశేశయముల్ గురువాక్యపాలనా
పాకటకీర్తిమంతములు రాముని పాదుక లాశ్రయించెదన్.

(పూవులసభమీద జల్లి)

సూత్ర—ఓసామాజికాలంకారిత సభామంటపాస్తారులార! సకలపండితకవిమండములార! మీకందరకు వందనపూర్వకంబుగ నొకవిజ్ఞాపనము జేసికొనుచున్నాడను. సావధానమనస్కులరై యూలకించెదరుగాక.

సీ. పూర్ణేందు చంద్రికాపూరంబుదిలకించి
ప్రమదమందనిచకోరములుకలవె!
పరినవఫలాంచితపరిమదావనముగాంచి
కుతుకమందని జీవతతులుకలవె!
మలయమారుతపోతముల వీచికలమెచ్చి
హాయిహాయననివారవని గలరె!
జగదీశ శ్రీరామ సత్కథామృతముపా
నముసేయదలపని నరులుకలరె॥

గీ. కానపూషకులాబ్ధి రాకాసుధాంశు
డై వెలయు రామచంద్రికథావిధాన

రూపకమ్మాడెదము మీరురూఢమతుల
రై విలోకించి యానందమందవలయు.

(ఆకసమువంకఁ జెవియొగ్గి)

ఏమనుచున్నారు! శ్రీరామకథయం దేభాగమనియా, ఇదిగో; చెప్పెద. వినుండు. అనేకనాటకములవ్రాసి సుప్రసిద్ధయశోధనము నార్జించిన బ్రహ్మశ్రీ చక్రావధానుల మాణిక్యశర్మ గారిచే రచింపబడిన శ్రీరామపాదుకాపట్టాభిషేక నాటకము ప్రదర్శించెదము.

(తెరలో)

మ. అకటా దైత్యులు మాంసమ్ముల్ గురిసినాయజ్ఞంబుసంపూర్తినం
దకమున్నే విఫలంబు సేసెసవనత్రాణార్థ మెవ్వానిపా
దుకలఁ బట్టుదుతోఁచ దేమియును నీదుష్టాసురశ్రేణిజం
పకనాజన్నము సాగునేయసురులన్ మర్దింపనేదారియో.

సూత్ర—అదిగో ; మాశైలూషతిలకుండు విశ్వామిత్రమహర్షి భూమికను దాల్చి రాక్షసవిఫలీకృతయజ్ఞకర్మంబులచే మఖరక్షణార్థ మెవ్వానిపాదుక లాశ్రయఁబని యోజించుచు నిట్లువచ్చుచున్నాఁడు. నేనిక ననంతరకరణీయమునకై త్వఱపడెదనుగాక.

(నిష్క్రమించును.)

ఇది స్థాపనము.





# శ్రీ
# రామపాదుకాపట్టాభిషేకము.

౧



## ప్రథమాంకము.



రంగము—ఆశ్రమప్రాంతము.

విశ్వామిత్రుడు ప్రవేశము.

విశ్వా. మ. అకటా దైత్యులు,, (అనుపద్యమును మరలజదువును)
అక్కటా? అమరారులెంతచేసిరి.

సీ. అలసదస్యస్థానమందున నృకపాల
పుంజంబులను పడబోసినారు
జ్వాలలమించుమార్జాలీయమునను పు
రీషధారల గుమ్మరించినారు
ఆగ్నీధ్రకుండంబులందు మాంసాస్థిదూ
ష్యపదార్థములవైచి యార్పినారు
సకలాధ్వరపవిత్రశాలల నస్పృశ్య
వస్తులతోనింపి వైచినారు

గీ. ఋత్విజులగల్లులతో ముంచియెత్తినారు
ప్రేక్షకులకు భయంబుగల్పించినారు
చెనటులస్మదధ్వరమును చెఱచినారు
కటకటా! ఎట్టులిట్టిమ్రుక్కడుల ద్రుంతు.

ఇసీ; ఆత్మీయ తపోమహిమానభిజ్ఞుండనై నేనెంత చింతిల్లు

చుంటిని. స్వల్పకార్యమునకై నాయంతవాఁడు పరులను యాచింపవలయునా ;

చం. సకలజగంబులన్ హృదయ జన్యములౌనటుజేసి బ్రిహ్మసృ
ష్టికిబ్రతిసృష్టిజేసిన విశేషతపోనిధినైననేను క్రో
ధకలనసర్వలోకముల ధ్వంసముసేయఁగజాలియప్రయో
జకునివిధంబునన్ బరుని సాయముఁగోరఁగ బోవువాఁడనే.

కావున నస్మదీయ రూక్షేక్షణానల కీలాకలాపంబుల యజ్ఞభంగులైన యసురకులంబులదహించెదనుగాక. జగంబుల నిష్కంటకంబులుగజేసి సవనంబు నిర్వర్తించుకొని సఫలమనోరథుఁడ నయ్యెదను.

(తెరలో) గాధినందనా ! తాపసులకు క్రోధనిరీక్షణము పాపహేతువై తపోమహిమంబును హాస్యముగఁజేయును. కావున అహంకారమునుజ్జగింపుము.

విశ్వా—అదిగో ; క్రోధనిరీక్షణమునుండి సంయములు నన్ను వారించుచున్నారు. అక్కటా ; ఇక నామ్రుక్కడుల నివారించుటెట్లు ? సవనంబుసాగించుకొనుటెట్లు ? మునులు, పూర్వంబున నే ననేక సారులిట్లు క్రోధదేవతకు వశుఁడనై తపఃఫలంబును ధ్వంసముఁజేసికొనినవాఁడనగుటచే నన్నిట్లు ప్రబోధించుట నా యందపారకరుణ వహించి నారనుట నిక్కము. ఏమిసేయుదును. ఓహో, స్మృతికివచ్చినది !

ఉ. తామసులౌచుసాధుపరి తాపముజేసెడు దుష్టదానవ
స్తోమముబిట్టుమారిచి వసుంధరభారము మాన్పశౌరి శ్రీ
రామసమాఖ్యబుట్టెనని శ్రావ్యముగావినియుంటిగాననే
నా మహితాత్ముఁగోరి యసురాళినడంచిమఖంబుఁజేసెదన్.

కావున నేనిపుడే అయోధ్య కేగి రామలక్ష్మణుల నొసంగుమని

దశరథమహారాజును యాచించెదనుగాక.

ఇదివిష్కంభము. (నిష్క్రమించును)

రంగము—సభాభవనము

—:o:—

(దశరథుఁడు వశిష్ఠుఁడు సుమంత్రుఁడు ప్రవేశించెదరు)

దశ—సుమంత్రా ! ఏదీ ! కుమారుల మృగయావిహారలీలాభివర్ణనము జేసి కర్ణరసాయనము గావింపుమా.

సుమ—మహారాజా ! మృగయావిహారముకాదు. దుష్టమృగవిజ్ఞానప్రబోధనాలీలావిహారమని పలుకుఁడు.

దశ—అదెట్లు ?

సుమ—మహాప్రభూ, అవధారు.

సీ. శ్రీపతిన్ సేవించు శేషుండనగరామ
చంద్రువెన్వెంటు లక్ష్మణు నిభర్త
కమలాక్షుశంఖచక్రముల నా భరతశ
త్రుఘ్నులరామచంద్రు నెడమైత్రి
యావీరబాలురయాత్మైక్య సంధాన
మాగుణార్ణవుల స్నేహప్రవృత్తి
యాసుకుమార లీలానముల్లాసంబు
లాబాలసింహ విహారలీల

గీ. నభినుతింపగ నాశక్యమా ! మహీశ ?
హరిహరార్కహిమాంశులో యవనినేల
నీకుజన్మించినారని లోకులెల్ల
బ్రస్తుతించుచునున్నారు పార్థివేంద్ర.

దశ—సుమంత్రా ! నాకుమారుల విషయమై లోకము స్తుతించుగాక. అట్టిదానిని నాబ్రమోలవచింపకుము. వారివారి యాశీర్వచనంబుల నాపుత్రులు వర్ధిల్లెదరుగాక.

సుమం:—మహాప్రభూ; మీరట్లు తలంచుట ధర్మమేకాని మరియొక గొప్ప విశేషమున్నది. లక్ష్మణ ద్వితీయుడైన శ్రీరాముని అధిజ్యశరాసనునిగా దెలిసి కొన్ని దుష్టమృగంబు లెదురువచ్చి ముంగాళ్ళుసాచి నమస్కరించి తమభక్తిని దెలుప నంత శ్రీరాముడు వాటిని బుజ్జగించి వెన్నుజమిరి సాధుస్వభావంబున జీవింపుడు, పొండుపొండని పలికెను. అంతనవియు మచ్చికతో దోకలాడించుచు బిల్లులవలె పాదలమాటున కేగెను. నిజముగ మీకుమారుల వనవిహారము దుష్టమృగముల సాధుమృగంబులుగజేయుటకొరకుగాని సంహారము కొఱకుగాదు.

దశ:—సుమంత్రా! ఈమహాత్ముడు వశిష్ఠుండు మావత్సలకట్టి విద్యావిధానమున పదేశించుటచేతకదా; ఆపసికుఱ్ఱల కట్టిగుణము లలవడినవి.

వశి:—దశరధమహీపాలా! ఈవిషయమున నన్ను బొగడవలదు. నీకుమారు లున్నతతేజస్సంభూతు లగుటచే సత్క్షేత్రములందు జల్లిన బీజములవలె నావిద్యాప్రబోధములు మహిమానువర్ణనీయములైనవి. యింతకును తెలివిలేని శిష్యులపట్ల నాగురుత్వము శోభిల్లునా?

మ॥ నలినీ పత్రములోని వారికణముస్థాన ప్రశస్తతన్ ముత్యమై
చెలువున్ మించెడురీతి నాకళలు నాశిష్యున్ భవత్సూనులం
దులలిన్నేరుటమించె భారమునవీనుల్ మోచినన్ స్వర్ణకుం
డలముల్ గండయుగంబుచే గదప్రతిష్ఠన్ కాంతులన్ మించుటల్.

దశర:—ఆచార్యోత్తమా! సహజవజ్రమైనను సానబట్టక కాంతులనీనదుకదా; కావున మీవిద్యాప్రబోధమువలననే నాకుమారుల కట్టి విద్యావైశద్యము కలిగినదని సంతసించుచు

న్నాను. యికముందును మీకరుణవలననే వారు వివాహితు
లై లోకసమ్మతులై రాజ్యభారము వహించి యభివృద్ధిఁగాం
చవలయునని నాయభిమతము.

ప్రతీహారి:—మహారాజా! విశ్వామిత్రమహర్షి యట, తనరాక దేవరకు
తెలుపమని నన్ను బంపి ద్వారముచెంతవేచియున్నాఁడు.

దశ:—ఓరీ; వేవేగ నామహాత్ము దోడుకొనిరమ్ము, పొమ్ము!

ప్రతీ:—చిత్తము—

(నిష్క్రమించును)

దశర:—వశిష్ఠమునీంద్రా; మనమెదురుపోయి తోడితెత్తము.రండు.

(విశ్వామిత్రుఁడు ప్రవేశించును)

దశర:—స్వామీ; గాధినందనా; నానమస్కారశతంబులఁగైకొనియీ
యుచితాసనంబునలంకరింపుఁడు.

విశ్వా:—దశరథమహీపాలా; నీకు భద్రంబులు కలుగుగాక. కూరు
చుండుము.

దశర:—మహాత్మా! నేనెంతటిధన్యుఁడను?

సీ:—తడిలేకయెండు కేదారభూములమీఁ

దింఁచి మేఘుండు వర్షించినపుడు

తనయులు లేకాత్మఁదపియించువాని ప
త్నికిసత్సుతుండు జనించినపుడు

పేటగొట్టుగొనిపోయిన ధనంబెల్ల జ
ర్వడియొడిలోన లభించినపుడు

అధికపిపాసార్తుఁడ మృతపానముజేసి
యభ్యుదయంబుల నందినపుడు

గీ. ఎట్టియానందమొదవునో అట్టినిర్భ
రప్రమోదంబునాకు సంప్రాప్తమయ్యె

దావకీనాగమంబున దాపసేంద్ర
అమలగుణసాంద్రి నేధన్యతముఁడనైతి.

విశ్వా—రఘువంశ సంభవుఁడవైన నీకు తపోధనసందర్శనము ప్రమోదావహ మగుట యాశ్చర్యముకాదు.

దశ—సంయమీంద్రా: రాజఋషివై యున్నను, నిరంతరము ననుపమాన తపోమహిమచే బ్రహ్మర్షిత్వమును గాంచిన లోకమాన్యుఁడవు. నిన్ను సామాన్య మహర్షులతో బోల్పరాదు. నన్నుఁ గృతార్థునిఁజేయుటకే నాకు సందర్శన మిచ్చితివి కాని మావంటి యల్పులవలన మీకు గార్యములుండునా! అట్లుండక పోయినను నన్ను ధన్యుని జేయుటకైన యేదేని యభిమతంబును దెలిపి నావలన పరిగ్రహించి సన్నానందింపఁ జేయవేఁడెదను.

విశ్వా—రాజేంద్రా: ఇప్పటి యుత్సాహమును బట్టి నీవిట్లు పలికితివి. కాని నేకోరిన పిమ్మట వెనుదీయుదు వేమో, యని సందేహించుచున్నాను.

దశ—మహాత్మా! అట్లు సందేహింప బనిలేదు. అస్మదాదుల తరింపజేసి యభ్యుదయంబుల నొసంగగల సత్పాత్రంబవు. నా పుణ్యవశంబున లభించితివి.

ఉ. కొంకకమీ యభీష్టములగోరుడు యష్టధనంబొ భూములో
కింకరకోటులో మణులో కేవలరాజ్యపదంబొ ఋత్విజా
హ్వాంకము లైనచేలములొ ప్రాణములో మఱియేవిమైన ని
శ్శంకనొసంగిధన్యత మసన్గతిగాంచెద గీర్తిమించెదన్.

విశ్వా—బళిబళీ! దశరథమహీరమణా; నీవదాన్యతకు మెచ్చితిని.

మ. జన్నంబొక్కటి సేయఁగాఁదలచిదీక్షం బూనియుండంగ గ్రా
క్యాన్నత్యంబు ననంతరాయములుసేయన్ బూనెదైత్యాళివా

రిన్ని ర్జించిమఖంబునన్ను మనుపన్ శ్రీరామునిన్ లక్ష్మణున్
గ్రన్ననాకునొసంగి పంపగదెయోరాజన్య చూడామణీ.

దశ—(తెల్లవోవును)

విశ్వా—ఏమి, రాజా ! అట్లు తెల్ల పోవుచున్నావు ?

దశ—చిత్తము.

విశ్వా—ఏమి, చిత్తము. నీవేదో సంశయించుచుంటివే !,

దశ—స్వామీ; సంశయములేదు. నాప్రార్థన మొక్కటి కలదు.

విశ్వా—ఏమి, ప్రార్థనము ! రామలక్ష్మణుల నర్పింపననియేనా ?

దశ—స్వామీ ; నామనవి నాలకింపుము. అసురుల సంహారించి మీ యజ్ఞము నిర్వర్తింప జేయుటె కదా, మీకోరిక ?

విశ్వా—కార్య మదియే, కాని అందులకై నేను కోరినది రామలక్ష్మణులను. నీవన్య పంథను నన్ను నడిపింపం జూడకుము.

దశ—మహర్షి కులచంద్రమా ;

మ. బవరం బెన్న డెరుంగనట్టి పసిపాపల్ భీకరాకారదా
నవరూపంబులగాంచనట్టి కసుబిస్సల్ వారితోనేల దో
ర్జవసంపన్నులజన్యవిక్రములనా సైన్యాళితోవచ్చినే
భవదీయాధ్వరపూర్తిజేసెదను విశ్వామిత్ర రక్షింపుమా.

విశ్వా—ఓయీ ; నీవంటివారు వేనవేలైనను మాకవసరము లేదు. అదియుంగాక నీవు వయో వృద్ధుఁడవు. తొల్లి దేవాసుర యుద్ధంబున నసురుల నోర్చిననాటి నీచేవ యిపుడు సన్నగిల్లినది. నీకుమారులు పసిపాపలనియు వా రసురులనోర్వ పట్టున నసమర్థులనియు నూహింప వలదు. అంతియెకాక నిన్ను నేన భ్యర్థించినది రామలక్ష్మణులనుకాని నిన్నుగాదు. క్షుధార్తునకు వస్త్రదానంబు సేయనెంచుట యెంత ఫలమో రామలక్ష్మణులకు మారు నీవు నా వెంటవత్తుననుట అంత సార్థకము. కావున మతిమంతుడవై నీకుమారుల నాకర్పింపుము.

దశర——(తనలో) కటకటా ! నాఅల్లారు ముద్దుబిడ్డల విడచి యొకని మున్నమైన మనజాలనుకదా ? ఏమిసేయుదును, దైవమా ; యీ మునివాక్యము గొప్ప పిడుగువలెనే నాతలమీఁద గూలి నదికదా ; ప్రతిక్షిప్తము వలికిన సులభకోపుడైన యీగాధే యుండు శపించినను శపింపవచ్చును. యిక నాకే దారియుఁ దోచుట లేదు.

విశ్వా——దశరథా! నీలో నీ వేదియో తలపోసి కొనుచున్నావు. రామ లక్ష్మణుల నర్పించుట నీకు యిష్టములేకున్నట్లు తోచుచున్నది. నీవు తొలుత యేది యడిగిననది నిచ్చెదనని వాగ్దుచ్చినాడవు. మఱియు,

చం. తరణికులీనులెన్నడసృతంబును బల్కనివారటున్న సు
స్థిరతరకీర్తినీ కతనజెందెఖిలంబిటు వంటివాడవె
క్కరణినిగొర్కెదీర్తునని కంఠముజించుకు బల్కినావహో
విరసుడవంచెఱింగినను వేడకయుండునుగాదె కల్లరీ.

దశర——మహాత్మా; సహింపజాల, సహింపజాల,

ఉ. కల్లరివాడగాను కులగౌరవము న్ఖిలమందజేయగా
నొల్లనుక్రూరరాక్షసుల నుక్కడగింపననర్హులైన నా
పిల్లలమీఁదిప్రేమ నిటువేడితినింతకు రాక్షసావళిం
ద్రెళ్ళగనేసిమీమఖ విధిన్నెఱవేర్చుటెకాదె కోరికల్.

విశ్వా——అట్లుకాదు. రామలక్ష్మణుల నర్పించుటయే నాకోరెక. దను జుల వధించుట యాగసంరక్షణము సేయుట, అది అనంతర కార్యము.

దశర——స్వామీ ; యజ్ఞభంగుల సంహారింపకుండ యజ్ఞము నిర్వర్తింప బడదుకదా ; ఆకార్యమునకు నన్ను నియోగింపుడు. తరువాత కుమారుల నర్పించెదను, నేనును మీసేవసేయుచుం దును,

విశ్వా—నీవు రానవసరము లేదు. రామలక్ష్మణులనే యర్థించితిని. వంపదలచితివా పంపుము; లేకున్న బంపననుము.

దశ—(స్వ) అక్కటా!విషమసంధిఘటిల్లినదికదా (ప్ర) మునీంద్రా ;ఆ రాక్షసుల పేరెయ్యది.

విశ్వా—సుబాహు మారీచులనువారు, సుందదానవు పుత్రులు. రావణమిత్రులు.

దశర—గాధినందనా ;

ఉ. సుందునిపుత్రులన్న నరసూనసి రావణ మిత్రులన్ననా
డెందమె వ్రక్కలయ్యెని కడింభటులా అని వారినోర్వనై
నందనుజాళి మూరొక్కసగ నన్నుగ్రహింపగ దయ్యనేజయం
బందినజచ్చినన్ వ్యసన మబ్బదునిల్తురు వంశవర్ధనుల్.

విశ్వా—రాజా ! నీ వాపనికై రానేల; చావనేల ; నీ విట్టి యమం గలము లాడకుము. రామలక్ష్మణుల నంపుము. వలదన్న నే నేగువాడను.

దశర—కౌశికమునీంద్రా ; అనుగ్రహింపకుము.

చం. వ్రతములచేసి దైవకృపవత్సలవల్ల చిర గాంచిచిత్తను
ద్ధితిగనినాడనిప్పటికి జన్మకుమారుల నుగ్రరాక్షసా
త్పతనము సేయ బంపుటకు ప్రాణము త్రుళ్లడమందుచుండెనో
యతికులవర్యనన్ను గొను మాపకిరూపలు పోరనేర్తురే.

విశ్వా—ఓయీ ; ఇంకనూ, అదే పదమా ! నీవు నీకుమారుల పరాక్రమము నెఱుంగక అట్లు పలుకుచున్నావు. భయము లేదు. పంపుము.

దశర—కటకటా, గాధితనయా ; నా ప్రార్థన మాలించి నాకుమారుల విడచి నన్ను గొంపొమ్ము. వారిని బాసిన నాప్రాణములు నిలువ జాలవు. అదియునుగాక.

సీ. తల్లిదాపలిబాహుదండంపు దలగడ
  లేకనిద్రింపగా లేనివారు
చిట్టిచిట్టికథలు చెప్పనూకొట్టుట
  లేకస్వప్నతజెంద లేనివారు
ఒకరైన బ్రక్క లేకుండ నిశ్చింతగ
  మేనుపాన్పున జేర్పలేనివారు
సంజచీకటినొంటి చనుమన్న చోభీతి
  లేకముందడుగేయ లేనివారు

గీ. కేళిలాలసులగువారు పాలుగారు
తళుకులీనెడుముద్దు చెక్కిళులవారు
రామలక్ష్మణసుతుల నర్పణముసేయ
జాలక్రూరులదైత్యుల సంహరింప.

స్వామీ ; దీనుడ. కుమారమయజీవితుడ. నన్ను గొంపొమ్మా.
బాలకుల విడిచిపెట్టుము. రక్షింపుము.

విశ్వా—ఏమీ, దశరథా ; ఎంత ప్రశాంతిమున బోధించినను వినక
నా కాగ్రహము తెప్పించుచుంటివే ! అసత్యమును పంచదార
వలె బరిగ్రహించుచుంటివే !

శా. నీకేగానికుమారులే ; జనులకున్ లేరో సుతప్రేమనీ
లోకుల్ నేరరొ ముద్దుముచ్చటలలోలుగ్గాని వారెవ్వరో
పాకులెన్నెప్పుడె ! నీభవంబలహరిశ్చంద్రా న్వయంబంచునే
నేకాంక్షించి తసత్యవాదివయివర్ధిల్లంగదే కల్లరీ.
నీతో నిక బ్రస్తావింపం దగదు. నేను పోయెదను. నీవు నీబిడ్డలతో
  చిరకాలము అసత్యవాదివై బ్రతుకుము.

దశర—మహాత్మా ; తాళుము, తాళుము. ఆగ్రహమును విడువుము.
వశిష్ఠు—దశరథమహారాజా ! నీవు తొలుత యేది కోరిన నొసంగు

వాడ ననిపలికి యిప్పు డిట్లులాడుట మీవంశములో లేని యనాచారము. యింతకును కుమారుల యందలిప్రేమచే వారి కెట్టియెగ్గు వాటిల్లునో యనుభీతిచే నీవు కులాచారధర్మమును విసర్జించుట బాడికాదు. అంతియెకాక యీవిశ్వామిత్రుండు అనుపమాన తపోధనుండు. యీతనివెంట నీకుమారుల నంపుట వారికి భద్రంబుల చేకూర్చుట కనితలంపుము. మరియు నీ కౌశికుని యనుగ్రహము వడసిన అనేకదివ్యాస్త్ర కోవిదులై నీకుమారు లఖిలకళ్యాణముల నందగలరు. సందేహింపకుము. సంతోషింపుచు నీకుమారుల నర్పింపుము. విశ్వామిత్ర రక్షితులైన నీపుత్రుల దేరిచూడ సురాసురలకైన నశక్యము. యే తృణము నభిమంత్రించి విడచినను ఆరాక్షసులు మడియ గలరు. కాని సంహారకర్మ మునులకు నింద్యమగుటచే నీకుమారుల కతంబున వారనోర్చి నీకు నీపుత్రులకు భద్రంబులగూర్చుటకై నిన్నిట్లు యాచించినాడు. కాని సమర్థతలేక కాదు. త్వరపడుము. పిల్లల రావింపుము.

దశ—ఆచార్యవర్యా ! ఈయంశ మిదివఱకే నాకెఱింగించిన నే నీమాత్రపు స్వల్పకళంకమునకు వ్యామోహమునకును లోనుగాక యుండెడివాడనుకదా ! (ప్ర) మహాత్మా ! గాధినందనా ! నా యవినయ వాక్యముల మన్నించుము. పుత్రుల నిప్పుడే యర్పించెదను. ఓరీ, ప్రతీహారీ ; నీవు పోయి రామలక్ష్మణుల నిటకు దోడ్కొని రమ్ము.

ప్రతీ—చిత్తము. (నిష్క్రమించి రామలక్ష్మణులతో ప్రవేశించును.)

రామ, లక్ష్మ — జనకా, వందనములు. మహర్షులారా, అభివాదములు.

విశ్వా, వశిష్ఠ — రవికుల తిలకులారా, మీకు భద్రంబులు కలుగుగాక.

దశ—చిరంజీవులు కంపు. వత్సలార; రామలక్ష్మణులార;

ఉ॥ కౌశికుడీ మహాత్ముడు జగన్నుతుడధ్వర దీక్షితుండు వి
రీశివతుల్యు వెంటజని యాతనిజన్నము బాహుసేయు గూర్
రాశరుల నవ్ధించి సవనావనముల్ బొనరించి ధాత్రినీ
దేశికునాజ్ఞ ధర్మము బ్రతిష్ఠనొనర్చి యశంబుగాంచుడీ॥

(రామలక్ష్మణుల కరముల విశ్వామిత్రుని చేత బెట్టును.)

విశ్వా—దశరథమహీపాలా; నీకుమారుల పాణికమలము లుంచబ
డినవి నాహస్తమున గాదుసుమా; జగత్కల్యాణ లక్ష్మీహ
స్తమున నుంచినావు. వీరిచే జగంబులే యుద్ధరింపఁబడుగాక!

వశి—సత్యము. సత్యము. జగదుద్ధరణ సమర్థులై యశఃకళ్యాణము
ల నందెదరుగాక;—

రామ—మహాత్ముల యనుగ్రహము మమ్ము సర్వథా జయశీలుర
జేయుగాక. తండ్రీ; పోయివచ్చెదము. గురువర్యా; పోయి
వచ్చెదము.

లక్ష్మ—అపర బ్రహ్మల యాదరమున మాకేదియు గొఱంత కలు
గదు. జనకా; పోయివచ్చెదము.

దశ—బిడ్డలార; పోయివచ్చెదరా—(విచారసూచన)

రాము—తండ్రీ! కుమారవత్సలా! ఆనందించుటకు మారు ఆరాట
మందెదవేల? మాకేమియు భయములేదు.

శా॥ బాల్యంబంచును జింతనొందకు మహాభారంభటంచుఁ మన
శ్శల్యంబుఁ వహియింపబోకు మరులఁ సాధించి యజ్ఞంబుసా
ఫల్యంబందగజేసిమౌని కృపసంపాదించి భాస్వద్యశః
కళ్యాణంబులగాంచి వచ్చెదము వీకఁ మమ్ముదీవింపుమా॥

దశర—మహానందము; వత్సలార; మీకు భద్రంబులు కల్గుగాక.
పోయిరండు.

లక్ష్మ—వెఱ్ఱితండ్రీ; త్రిలోక పూజనీయుఁడైన విశ్వామిత్ర మహర్షి వెంట జను మాకేమిభయము! వగవకుము.

దశ—మహాత్మా; గాంధినందనా.

ఉ॥ ఆకటికోర్వలేరు నిశలందు జరింపగలేరు మెక్కలే
రాకులదుంపలన్ శిలలయందునఁ ముండ్ల బరుండలేరు మీ
రేకరణిఁ దయఁ జెలికి యేలెదరోమిము జేర్చినాడవీ
రేకదనాదు పాణములహీనతపోధన గాధిందనా॥

విశ్వా—రాజా! రామలక్ష్మణులిక నాపిల్లలుగాని, నీపిల్లలుగారు. నేనే సంరక్షించుకొనెదను. వత్సలార; రండు. నావెంటపోవుదము. దశరథా; నీవు నిలిచిపొమ్ము.

రాము—చిత్తము.

లక్ష్మ—చిత్తము.

(విశ్వామిత్రునితో యేగెదరు.)

దశ—వశిష్ఠమునీంద్రా; గాధిసూనుని వాక్యములలో నాకేదో యర్థము స్ఫురించుచున్నది. మరల పుత్రుల నాకంట బెట్టకుండునుకద.

వశి—అట్లు తలంపవలదు. కొంతవరకు సాగనంపుదము. రమ్ము.

(అందరు నిష్క్రమింతురు.)





# శ్రీ
# రామపాదుకాపట్టాభిషేకము.

ఒ



## ద్వితీయాంకము.



రంగము—అరణ్యము.

విశ్వామిత్రుఁడు ప్రవేశించును.

విశ్వా—(వెనుకఁజూచుచు ఆశ్చర్యముతో) ఆహా; ఈరామలక్ష్మణులు చిరుతప్రాయము గలవారైనను వీరి మంత్రపురశ్చరణా విధాన దీక్ష మెట్టి మనోదార్ఢ్యము కలిగినది. బళిబళీ; నా మంత్రోపదేశమునకు దగిన శిష్యులు తటస్థించినారు. యిపుడు కదా; నావిద్యలు సార్థవంతములైనవి. ఔరా; ప్రతదీక్షావిధానము నేను చెప్పకున్నను చిరపరిచయులైన యట్లు హంసను బంధించి పద్మాసనాసీనులై బలా, అతిబలాఅను మంత్రముల నెట్లు పురశ్చరణము సేయుచున్నారో, అదుగో; పురశ్చరణము నిర్వర్తించి నాదెసకే యిట్లు వచ్చుచున్నారు.

(రామలక్ష్మణులు ప్రవేశించుదురు.)

రామ—గురువర్యా! తమ రానతిచ్చినట్లు మంత్రముల బురశ్చరణము సేసితిమి. మాకాకలియు డప్పియు శ్రేమయు గానరాకయున్నవి. మాశరీరముల నమితమైన బలమును చేకూరినది.

లక్ష్మ—విశ్వామిత్ర మునీంద్రా; అంతియేకాక మాహృదయముల నేదో అద్భుత దివ్యతేజస్సు ప్రవేశించినట్లున్నది.

విశ్వా—వత్సలారా! ఇక మీకెద్దానివలనను భయములేదు.

రామ—మహాత్మా; మీ రుపదేశించిన భృశాశ్వసంభవ మహాస్త్ర మంత్రములను యథావిధిగ బురశ్చరణము జేసితిని. అప్పటి నుండియు నాహృదయమున ధనుస్సు నెక్కిడి శరసంధానమును జేసి యే దుష్టునైన నెప్పుడు సంహరింతునా, యని యూహాపోడమున్నది. దీనికి వినియోగ మెప్పుడు కలుగునో, యానతీయ వలయును.

విశ్వా—రామా! ఇదియే జనస్థానము. యిందే మారీచసుబాహుల తల్లి తాటకయను నిశాచరి జగత్కంటకియై సాధుపీడనము సేయుచుండును. ముందుగ దీనిని నీబాణమునకు బలిపెట్టుము. ధనుష్టంకారము జేసిన నదియే యిటకు రాగలదు.

రాము—అట్లయిన నిదే గుణఘోషము గావించెదను...(నారిమోగించును.)

(తెరలో తాటక)

శా॥ ఔరా; క్రూర, దురాత్మ, యెవ్వడవురా! హాతాటకా భీమ దో
స్సారంబింత యెఱుంగకుంటివో ధనుష్టంకారముల్ జేయ ఛీ!
దారమ్ముంక భవచ్ఛరీరమును దంష్ట్రాగ్రాలుగావించుచుల్
నీర క్తంబును ద్రావివైచెదను పానీయంబుగా మానవా॥

లక్ష్మ—అన్నయ్యా; అదే తాటక; భీకరకరాళయై మనమీదికి వచ్చుచున్నది. వేగ బాణంబును వింట సంధించుము.

రాము—విశ్వామిత్రమునీంద్రా! యీతాటక ఆడుదికదా; దీనిని వధించిన స్త్రీహత్య దోషము సంభవించునుకదా;

విశ్వా—రామభద్రా! ఇది ఆడుదియైనను జగత్కంటకియగుటచే నీకు స్త్రీహత్యదోషము రానేరదు. అనార్య కార్యమునకు నిన్ను బురికొల్పుదు నా; కావున వేగ బాణమును సంధించి కూల్చుము.

రామ—అటులైన సరియే.

(తాటక ప్రవేశించును.)

తాట—ఓరోరి, మానవబాలురార! ఈతాటక పేరు వినినంతనే త్రిజగంబులు గడగడవడంకుచుండనింద్రాదిబృందారకబృందంబులు సైతము నానివాసభూమియగు నీవనంబును గన్నెత్తియైన జూడక మహాభయంబున బలాయితు లగుచుండ మారాక్షసకులముల కశనప్రాయులైన నరులు పసికుర్రలు మీరింత భయంబులేక వచ్చి ధనుష్టంకారము సేయుదురుగా; మిమ్ముల బట్టి త్రాటితేగలవలెనమిలెద నన్నను సూక్ష్మశరీరులే; నాకు దృష్టి దీరదే; మీరేదో యాటలనితలంచి ధనుష్టంకారములు చేసియుందురని తలంచెదను. లేకున్న కొండతో తగరు డీకొనినట్లు నాతో మీరెదుర్కొన దలంతురా; ఏమి, మీ యుద్దేశమేమో, తెలువుడు.

రాము—ఓసీ; నిశాటీ; జగత్కంటకి వని నిన్ను జంపి వనంబుల భయము మాన్పుటకే ధనుష్టంకారవ్యాజంబున నిన్నాహ్వానించితిని. నీవిది మొద లెవ్వరికిని బాధసేయక మునిసేవల జేయుచు గాలము గడిపెదవన్న నీకు బ్రాణదానంబు జేసెద. లేకున్న నీబాణాగ్నికి శలభంబ వయ్యెదవు?

తాట—ఔరా! ఏమి కండ కొవ్వు; నాకు బ్రాణదానంబు జేసెదవుగా! ఎరుగక నారిమోగించితివేమోయని దయదలచి యుడిగినందులకిదియా ప్రత్యుత్తరము? మిమ్మిరువుర మామిడికాయ పచ్చడి బ్రద్దలవలె రెండుదంతములక్రిందను బెట్టుకొని యెముకలతో బాటునమిలివైచెద చూడుడు.నిలువుడు. యీ బవిరిగడ్డపు మునిముండకొడుకు మిమ్మిట్లు పురికొల్పినాడు, కాబోలు! ముందు మిమ్ముభక్షించి తరువాత నీగడ్డపునన్యాసి కండల గొతికిలినివేసెద. రండు.

రాము—ఓసీ, తాటకీ; చచ్చితివి—(బాణమేయుతాటకిగూలును.)

విశ్వా—అమ్మయ్యా, రామచంద్రా; యిప్పటికి కొంతభయమువదలినది. మీరిరువురీవటవృక్షముక్రిందనే వేచియుండుడు. యిక్కడికి సమీపముననే నాయాశ్రమము. నేనుపోయి యజ్ఞమారంభించెదను. రాక్షసులీతావుననుండి యజ్ఞభంగము సేయుదురను తలంపుతో మిమ్మిందుండుమంటిని.

రాము—స్వామీ, దనుజులెందున్ననేమిరక్షింపదగినది సవనముకదా; కావునమేము యజ్ఞవాటికకు సమీపముననే యుండెదము.

విశ్వా—ఔను.అదియు మంచియూహయే; రండు. పోవుదము.

(అందరు నిష్క్రమింతురు.)





శ్రీ

# రామపాదుకాపట్టాభిషేకము.

## తృతీయాంకము.

రంగము—విశ్వామిత్రాశ్రమము.

రామలక్ష్మణులు ప్రవేశించెదరు.

రాము—తమ్ముడా, లక్ష్మణా: దానవవధార్థమై ధనుస్సెక్కు పెట్టినిలచితి నికాని యజ్ఞమునందు సామమంత్రముల రవళి నా చెవులకుహాయిగాసోకుచుండుటచే నత్యానందమున మధ్యనారవశ్యము నొందుచు ధనుస్సును జారవిడచుచున్నాను. యింతలో రాక్షసులేమైనసేయుదురేమో నీవేమరకయుండి నాకుజ్ఞప్తిదెచ్చుచుండుమా;

లక్ష్మ—అన్నయ్యా; యజ్ఞమారంభించి నాలుగుదినములు గడచినవి. యిదిఐదవదినము. యింతవరకొక నిశాటుడును గన్పడడాయె తాటకిని జంపుటచే: మనపరాక్రమ మెఱింగిఅసురులు హతాశులై పారిపోయి యుండనోపు.

రాము—వెర్రితమ్ముడా? ; అసురులకు గుణగ్రహణత్వ ముండదుకదా? అహంభావమువారి సొమ్మగుటచే నెందరు చచ్చిననుమనము నుచచ్చెద మాయను మూర్ఖతవారిని విడువదు. యీరాత్రియే హోమములు మెండుకావున నీరాత్రితప్పకవారి దౌష్ట్యము నుబ్రదర్శించెదరు. మనముబహుభద్రముగ నుండవలయును.

లక్ష్మ—అన్నా; అవును. యజ్ఞమీరాత్రితో సమాప్తిగనుక నేటిరాత్రి యేవారివిజృంభణముచూపవలయును. (చూచి) అదిగో; గగనం

బునదక్షిణదిశ నుండియేదియో మేఘమాలమింటికెగయు
చున్నది.

రామ—తమ్ముడా; అది మేఘమాలకాదు. దానవసందోహంబు. సంది
యములేదు. చూడుమూ;

గీ॥ క్రమముగా దానవులుసమీపమునుజేర
హస్తములరక్త భాండమ్ములష్ఠిచయము
స్పష్టముగగనుపడ జొచ్చెజాలమేల
బాణములనేసి మధ్యనేభగ్నపరతు.

(బాణమువదలును)

లక్ష్మ—అన్నా; శోణితభాండములుభగ్నములై పవి. యెముకల పోగు
లూడిక్రింద బడినవి. నేనీ బాణమునవా నిశాచులదూలించెదను.

(బాణమేయును)

రామ—తమ్ముడా; రక్కసులు చెల్లాచెదరై నారు. అల్లదే; యెవడో దాన
వుండుక్కు మిగిలిగదనుగైకొని యీలాగేవచ్చుచున్నాడు.

(సుబాహుడుప్రవేశించును)

---

సుబా ఉ. మానవకీట కంబయసమానపరాక్రము నీసుబాహునిన్
బూనివధింప నీతరమపోరున నాజనయిత్రితాటకా
స్త్రీనివధించినంతనె విశేషపరాక్రమ శాలినంచు నీ
మానసమందునెంచితి వొ[మ]ందగసేతును రారమానవా.

రామ—ఓరీ; దైత్యాధమా; నిన్ను నేజంపబనిలేదు. నీదౌష్ట్యమేనిన్నుదు
దముట్టింపగలదు. రా, రమ్మా శరమ్మున నీప్రాణముల బాసెదవు
గాక. (బాణమేయసుబాహుడు చచ్చును)

మారీచుడుప్రవేశించును.

మారీ॥ గీ॥ మాసుబాహుని నీతీవ్రమార్గణమున
గూల్చినానని గర్వింపగూడదోరి

మాసవాధమ మారీచదానవుండ
నిన్ను జంపగని దెవచ్చియున్నవాడ.

(గదనుద్రిప్పును)

రాము—ఓరీ,మారీచా; నీవునునీసోదరునిదారినేయనుసరించెదవుగాక:-

(బాణమేయమారీచుడు పారిపోవును)

లక్ష్మ—అబ్బబ్బా; యీయస్త్రముసుడిగాలి వలెమారీచుని జుట్టుము ట్టియెచ్చటికో కొంపోయినది.

విశ్వా—(ప్రవేశించి) రామలక్ష్మణుల కౌగలించుకొని,

కం॥ రామాదనుజులుద్రుగ్గిరి
సేమంబుగ మఖముసాగెక్షితిశాంతిల్లె
నీమూలమునను ; కేవల
శ్రీమహిళాపతివి కావె, చింతింపంగన్.

రాము—స్వామీ ; సర్వమునకును మీయనుగ్రహమేకారణము.

విశ్వా— మంచిది.నీసుగుణంబులు జగదలంకారమ్ములు. యిక్కడికనతి దూరంబున మిథిలానగరంబున జనకమహారాజు ధనుర్యాగము సేయుచున్నాడు. మనమచ్చటకు బోవలయు. రండు.

రాము:—చిత్తము. (అందరునిష్క్రమించెదరు)

రంగము—గౌతమాశ్రమము

విశ్వామిత్ర రామలక్ష్మణులు ప్రవేశించెదరు.

రాము—గురూత్తమా: కౌశికమునీందా్ర?

చం॥ వనములహోమ ధూమములు పర్వనచందము కానరాదు ప్ర
క్కనుగలతీవ జొంపములు క్రిమ్మెనుమార్గ నిరోధమౌనటుల్
మునులుచరించు నట్లుసుమముల్ గ్రహియించినరీతిదర్భ గో
సినవిధమింత లేకకనుజెడ్వడెనెవ్వని యాశ్రమం బిదో.

విశ్వా—రామచంద్రా: ఇదిగౌతమాశ్రమము. యింట్లుండుటకుగార

ణముభార్యయైన అహల్యకు శాపమొసంగితాను హిమవంతం
బునకేగుటచే యిట్లుపాడుపడినది.

రాము—గౌతమ మహర్షియంత అహంకారము జెందుటకు దగినంత
కారణముండకపోదు.—(నడుమ శిలఅహల్యయై నిలచును.)

అహ—ఆహా! నాశాపమునకువిముక్తి కలిగినదే!(చూచి)నాభర్త యెరిం
గించిన శాపవిమోచనప్రకార మీమహాత్ముడే కాబోలును;
రఘుకులపారావారశర్వరీరమణుడు.రాముడు.(ప్ర) ఓమహాను
భావా,రామచంద్రా! నీకనేకవందన సహస్రములు.

రామ—పూజ్యురాలా; వలదు.వలదు.నీకునేబుత్రతుల్యుడను.నమస్క
రింపవలదు. నీవెవ్వతెవో ఏందుండియిట్లా విర్భవించితివో
ఎరింగింపవేడెదను.

అహ—(సిగ్గున దలవంచి నిలుచును.)

విశ్వా—రామభద్రా! ఈమెయే గౌతమపత్ని.అహల్య.నీపాదధూళీల
వన్నుగ్నిచే శాపవిమోచనమును గాంచినదని తలంచెదను.

అహ—(శ్రీరామమూర్తికొండొక కారణంబున నీమార్గమున బోవు
చుండ నామహాత్ముని పాదధూళిసోకుటచే నీవు శాపవిమోచ
నమును గాంచెదవని నాభర్త గౌతముడుతొల్లి యానతిచ్చెను.
స్వామీ! అప్పటినుండి పాషాణత్వమునుగాంచి మీయాగము
నంబుగోరుచు మిమ్మేధ్యానముసేయుచుండ నిప్పటికి నాశాపవి
మోచనమైనది. రామమూర్తీ; నీవుజగంబులనుద్ధరింప నవతరిం
చిన రమాకళత్రుండవు. నానాజీవకోటులకాత్మవై యున్న పర
మాత్ముడవు. లీలామానుష వేషధారివి.అస్మదీయచిరకార తపః
ఫలంబవు. నాసుకృతవిశేషంబున నెట్టితపస్సంపన్నులకును దుర్ల
భమైన నీసందర్శన భాగ్యంబునుగంటిని. ధన్యతగంటిని.
బ్రతుకగంటిని.

మ॥ పతిశాపంబున రాతినైన నను మీపాదద్వయాంభూళిసం
గతిబూర్వాకృతిజేసినావు మనుజాకారంబులన్ గొన్నశ్రీ
పతిశేషాహులుకారె మీరు కలుషవ్రాతంబుచల్లారె మీ
కతనన్ బూతచరిత్రనైతిని నమస్కారంబులన్గాంచుడీ॥

(నమస్కరించును)

రాము—తల్లీ! మావందనములగైకొనుము. స్వయంకృతకర్మాను భవ
మేరికిని దప్పదుకదా? మీరికగౌతమభగవానుని సేవింపబొంము.

అహ—మహాభాగ్యము. పురాణ పురుషులార! విశ్వామిత్ర మహర్షుల
వారికారణంబున బవిత్రతవందిసంమలకు వందనము లర్పించు
చున్నాను. సేనికననుజ్ఞగైకొనెదను.

విశ్వా—అమ్మా! విచ్చేయుము.

అహ— (నిష్క్రమించును.)

లక్ష్మ—ఆచార్యోత్తమా; ఈమెకిట్టి ఘోరశాపమును గౌతముడిచ్చు
టకు కారణమెయ్యదియో.

విశ్వా—రామలక్ష్మణులారా! ఇంద్రుడొకనాటివేకువ అహల్యాలోలు
డై గౌతముని యాశ్రమమున కోడిమైకూసెను. అంతనాతడు
తెల్లవారవచ్చెనని యనుష్ఠానమునకై నదీతటంబునకేగెను.
శకుంద్రుడప్పుడు గౌతమవేషమునుదాల్చి యహల్యనెనయుచుం
డెను. అత్తరినెంతకును దెల్లవారకుండుటచే సందేహించిగౌతము
డు దివ్యదృష్టితోజూడ శతముఖుని దుష్కృత్యము దెలిసి వచ్చి
యింద్రుని ముష్కహీనుడగునట్లును అహల్యను శిలారూపము
ధరించి బూదిలోమగ్గిగాలిని మెక్కుచువెక్కేండ్లు దుఃఖమను
భవించుమని శపించితాను హిమాచలమునకుబోయెను.

లక్ష్మ—పరనారీలోలుడైన మహేంద్రుని పాపిణములతో విడచినందు
లకు గౌతముని కరుణారసము బొగడవలసినదేకాని తరువాత
నింద్రునిగతియేమైనది, స్వామీ?

విశ్వా—తరువాత మేషాండముల సంధించి యింద్రునికి అతకదీర్చి నారు. మనమిక మిథిలానగరమునకుబోవుదము రండు.

(అందరు నిష్క్రమించెదరు.)





# శ్రీ

# రామపాదుకాపట్టాభిషేకము.



## చతుర్థాంకము.

రంగము—మందిరము.

(జనకశతానంద విశ్వామిత్ర రామలక్ష్మణులు ప్రవేశింతురు.)

జనక॥ ఉ॥ కౌశికమౌనివర్య ! తనుకాంతిని సూర్యునిమించుదివ్యసం
కాశులువీరలెవ్వరో ! జగద్భరణార్థము జన్మగన్న గౌ
రీశుడొ శ్రీశుడో తెలుపవే ప్రముదాంబుధి వేలమించి స
ర్వాశలదాటె నాకెదియొయాసజనించెను వీరిజూడగన్.

విశ్వా॥ జనకమహీపాలా ! నీసయాకు గారణమున్నది. లేకపోలేదు.

చం. దశరథపుత్రులిర్వురును దారగుణాఢ్యులు రామలక్ష్మణుల్
మశకములట్లరాక్షసుల మాడ్చి మదీయమఖంబుగాచి భ
ర్తృశపితయౌనహల్య బదరేణువుచే సతిజేసి పూజ్యమా
పశుపతివింటినెత్తితమ పట్టినిజేకొనవచ్చె. భూవరా.

జనక॥ ఓహో; అలాగునా ;

శతా—ఆహా ! నేడెంతసుదినము. నాజనయిత్రి యహల్యాదేవికి
శాపవిమోచనమును జేసిన వారావీరు. ఓహో, రామ
చంద్రా !

గీ. సంయమివిధేయుడవె యైన సంయమీంద్ర
శప్తలగునంగనల కలుషంబుబాపి

పూతలగజేయజాలు నద్భుతపుశక్తి
గలిగితివికాననిదె నమస్కారశతము.

రామ—ఆ, ఆ, అపచారము, అపచారము, పూజ్యులగు వారు శిష్యులకు నతిసేయరాదు.

విశ్వా—ఈశ్వరశక్తి నీయందుంటచేత నీకీతఁడు నమస్కరించినను నమస్కరింప వచ్చును.

జనక—విశ్వామిత్రమహర్షీ ! తాటక సుబాహు మారీచ మథనకారణంబున బాహుపరాక్రమంబును, అహల్యాశాపవిమోచన హేతువువలన భువనపావిత్ర్యంబును, ఈశ్రీరామునియందు విడంబించుచుండ నాక్రమము ఫలించినదనియు, మాసీతమనోరథము చిగురించుననియు తలంచుచున్నాను. ఓరీ, సేవకులారా ; శివచాపంబు గల మందసము నిటకు దీసికొని రండు.

సేవ—చిత్తము—(హరిధనుస్సున్న పెట్టెని దెచ్చెదరు.)

జనక—శ్రీరామచంద్రా !

మ. చిరకాలంబులనుండి మాకులజులర్చింపంగ నొప్పారునీ
శ్వరచాపంబిదియెవ్వడశ్రమమునన్ జ్యావల్లిసంధించునా
వరుడేవిక్రమశుల్కన తనయకున్ వైదేహికిన్ భర్తయౌ
నరుదారంగొనయంబు నెక్కుమురామా నీకుగళ్యాణమా.

రామ—ఆచార్యోత్తమా, గాధినందనా ; అనుజ్ఞయైన నాకీ శైవచాపము స్వాధీన మగునేమో, చూచెదను.

విశ్వా—రామభద్రా ; సందియములేక స్వాధీనమగును. ఆరోపింపుము.

రామ—(ధనుస్సునుసమీపించి) ఓశైవకార్ముకమా ;

ఉ. మేరుసురూపమైజగదమిత్రుల నాత్రిపురాది దైత్యులన్
బోరునగూల్చియీశునకు బూర్ణజయంబు నొసంగినట్టియో

భూరిశరాసనంబననుబొంది పరాక్రమ శుల్క జానకిన్
గూరిచికీర్తినిల్పు మిదిగోనొనరించెద వందనంబులన్.

(ధనస్సున నారిదగుల్పఁజూచి)

ఇది కడు బిరుసుగ నున్నది. ఏమగునో, తెలియదు. అట్లైనను నారిని సంధించెదను.

జన—వత్సా! రామచంద్రా; యింతవరకెవ్వరు దీని సశ్రమంబున నెత్తిన వారే లేరు. నారినెక్కించుము.

విశ్వా—రామభద్రా; సంశయింపకుము.

రామ—(నారినెక్కింపధ్వనియే విరిగిపోవును.)

సీతా—బళి, బళి, రామచంద్రా! సీతను గెలిచికొంటివి.

జన—మహాసంతోషము. నా వ్రతంబు నేటికి ఫలించినది. ప్రమదా; జానకిని దోడితెమ్ము.

(జానకీప్రమదలు ప్రవేశించెదరు.)

జనక—అమ్మా; జానకీ! నావ్రతంబును నీమనోరథంబును నేటికి సఫలములైనవి. ఈరామచంద్రుని గళంబున నీపుష్పహార మలంకరించి వరింపుము. రామభద్రా, నీవీపవ్రిసవమాలికను మానైదేహి కంఠంబున శృంగారింపుము— (దండలిచ్చును)

రామ
సీత } (ఇరువురు పూలదండల వేసికొందురు.)

అంద—“అనయో ర్దంపతో్య రత్షీణ మంగళావాప్తి రస్తు”

(అక్షతలు చల్లుదురు.)

జనక—విశ్వామిత్రమునీంద్రా; శ్రీరాముఁ డొనరించిన యద్భుత కర్మకు మెచ్చి యాసీత నర్పించుటయేకాక నాతమ్ముల పుత్రి కలైన యూర్మిళా మాండవీ శ్రుతకీర్తు లనుబాలికలనుగూడ లక్ష్మణభరతశత్రుఘ్నులకిచ్చి పెండ్లిసేయ వలయునని కుతూ

హాలముగ నున్నది. ఈవివాహములు నాల్గును త్వరలోనే సేయవలయును. ఇందులకై తగు బురోహితుల నంపి దశగ ధాదిబాంధవుల రావించెదను. మీరును వారలసమ్మతిబడిచి వివాహములమోఘముగజరుగునట్లు దయసేయవలయును.

విశ్వా—అయ్యది సర్వోత్తమము. ఈయువి అమోఘముగ జరుగు నట్లు కమ్మ నొకదానిని వ్రాసి పంక్తిరథ మహీపాలుని కడ కనిపెదను. నీవును తగినవివాహప్రయత్నముల గావింపుము.

జన—మహాభాగ్యము. మరియుందరికును అనంతర కరణీయంబులకై యేగుదము. రండు. వత్సలారా ; గృహాంతరమునకు దయ సేయుము.

(అందరునునిష్క్రమించెదరు.)

రంగము—పురవీధి. సఖులప్రవేశము.

---

సఖ—ఆహాహా ; నేనుపుట్టి బుద్ధెఱింగిన తరువాత నిట్టి వివాహ మహోత్సవము లెన్నడును జూచి యుండలేదు. శ్రీరామునకు సీతయు, లక్ష్మణునకు నూర్మిళయు, భరతునకు మాండవియు, శత్రుఘ్ననకు శ్రుతకీర్తియు, భార్యలై లక్ష్మీనారాయణులట్లు, శచీపురందరులట్లు, రోహిణీచంద్రులట్లు, పద్మినీప్రభాకరులట్లు శోభిల్లు చున్నవారు. ఉభయ బాంధవ సందోహంబు సము త్సాహంబున పర్వసమయ పయోరాశివలె నుప్పొంగుచున్నది. అన్నదానమా ; అమితముగ సేయబడినది. భూరిదక్షిణలు మోసికొని పోవలేక బ్రాహ్మణులు రిచ్చవడి చూచున్నారు. సువర్ణ రత్నాభరణ వస్త్రాదులచే బహూకరింపబడిన ముత్తై దువుల యానందమునకా, మేరలేదు. వేయేల ; యీయది జగత్కల్యాణముకాని రాజపుత్రికల్యాణము కాదు. అదిగో,

యేవియో, కార్యములుండుటచే వెంటనే పయనమగుచున్న దశరథాది బాంధవుల సాగనంపుటకై జనకాదులు ప్రయాణ మగుచున్నారు. ఈమహోత్సవముల కన్నిటికిని మాగురువు గారు విశ్వామిత్రమహర్షి కారణ భూతుండగుటచే నా మహా త్ముని శిష్యుడవగు నాయందును కొంత ప్రత్యుత్థానాదిభా రము నిలచియుండుటచే నేనును వారిని వెన్నంటి కొంతదూ రము వఱకును సాగ నంపవలయును. కావున త్వఱపడి పోయె దనుగాక ;

(నిష్క్రమించును.)

రంగము — మిథిలాపురోప కంఠసీమ.



దశరథ జనకులు ప్రవేశించెదరు.

దశ — విదేహభూపాలా! ఇప్పటి కెంతో దూరమువచ్చినారు. మీరిక వెనకకు మరలుడు.

జన — పూజ్యా; మీతో వియ్యమందిన యానందము మితిమించుటచే విడువజాలకుంటిని. దయయుంచుడు. రామాదు లప్పుడే ముందేగి తమకొరకై నిరీక్షించుచు రథము నధిష్ఠింపక యా చెట్టుక్రింద నిలచినారు.

(తెరలో)

శా॥ ఏడీ యెందులనుండె రాముడట మాహేశాంక మాపాత్రవి
ల్లాడింపగనె భగ్నమాటగని గర్వాంధత్వమున్ గొన్నవా
డేడీ! రాజకులాంతకుండనగు నేనింకుండ నాపేరనీ
డాడందిమ్మరు చున్నవాడెచట మట్టాడింతునాగొడ్డలిన్.

జన — (భయముతో) అకటా! ఇకేమున్నది. క్షత్రియకుల మారకుం డైన భార్గవరాముడు వచ్చుచున్నాడు కదా?

దశ—ఏమీ, పరశురాముడా; ఇంకనూ విశ్రాంతి వహింపలేదా; నాకుమారుడు రామనామధారియగుటచే గాబోలు; నీతని కీయహంకారము.

పర—(ప్రవేశించి) ,,ఏడీఎందుల" అనుపద్యమును చదువును.

దశ—
జన— } భార్గవరామా; నమస్కారములు.

పర—ఏమీ, దశరథావనినాథ జనకులార:—

శా: నారాకన్వీన బాణముల్విడికిట న్బదంబుగా బట్టినా
రీరత్నంబుల దూరుమీరలిపుడీ రీతిఁ భయంనేదిగం
భీరంబొప్ప నమస్కరింపగతమేమీ తెల్పుడీ యీతిర
స్కారంబుఁ భృగురాముడోర్చునె.భవత్పాత్రంబుదూలించెడున్.

దశ—మహానుభావా; నమస్కరించితిమి కాని తిరస్కరింపలేదే;

పర—కాదు, కాదు, మీనమస్కారంబులు తిరస్కారగర్భితములే; మాకుదెలియును.

మ॥ శివచాపమ్మును వమ్ముజేసెగద మాచిన్నారిరాముండు భూ
ధవశత్రుండగు భార్గవుఁ గెలుచు నంతాపంబు మాకేలయం
చు వగఁదక్క విశేషగర్వమునసీసుఁ బుక్కటన్బట్టినం
స్తవముల్ సేయుచుమొక్కుచుండిరో కొ మిథ్యాభక్తిచే మత్తులై.

జన—అర్యా! చిరుతప్రాయంపు రాము డేదో చేసెనని నమ్మి మిమ్ము మేము తిరస్కరించుదుమా;

పర—ఏమీ; ఇంతకుమున్ను నన్ను జూడగనే మూలమూలలుదూరు మీరిప్పు డెదురుగ వచ్చుటయే తిరస్కారము. అగుగాక, మీ రాము నిటకు రప్పింపుడు.

దశ—భార్గవరామా; రాము డిప్పుడెందులకు?

పర—ఎందులకా; మర్దించుటకు;-

ఉ. మామక సద్గురుండగును మాపతిచాపము పూజసేక యె
ట్లో మిధిలేంద్రునింటబడి యుండగనేన ఘనుండనంచు వా
డామహనీయ చాపమున హంకృతి భగ్నముసేయు టొప్పునే
ధీమహితుండుగుర్వుల ప్రతిష్ఠకు భంగముకల్గ సెచునే.

దశ—భార్గవరామా; చాపంబునకు నారి నెక్కించుచుండ నది భగ్న మయ్యెను. అంతమాత్రమున శివునకు గాని శివశిష్యుడవైన నీకుగాని యిందు బరాభవ కారణ మేమియును లేదు. దయయుంచి యాగ్రహింప కుందువుగాక.

పర—నా గురు చాపమును భగ్నము జేసినవానిపై నేనాగ్రహింపక మానను. నీవు నీరాము నిటకు రప్పింతువా? నేన స్వయముగ బోయి యారాము కంఠరక్తధారలచే నాపరశు విదాహమును దీర్పమనియెదవా?

దశ—స్వామీ! మీరాగ్రహించిన జగంబులాగునా; శాంతించిమొన్న పరిణయమై కళ్యాణకంకణము నింకను విసర్జింపని నాకుమారుని రాముని సాదరమున నాశీర్వదింపుడు.

పర—దశరథా; వసుంధరా చక్రంబునం గల రాజవంశముల నామావశేషము గావింప నేనును వీరకంకణము గట్టుకొని యుష్మదాది సరపాలురు మడియువరకు నేను విసర్జింప కున్నవాడను. కావున రాముని రప్పింపుము.

జన—(స్వ) కటకటా; జల్లారిన భార్గవ కోపాగ్ని మగల రగులు కొనుచున్నదే; యికేదిదారి. (ప్ర) స్వామీ? రాముడుపసివాడు. అపరాధియైన క్షమింపుము.

పర—నే నట్లు క్షమించు వాడనునాను. రాజుల శిక్షించువాడను.

రాము—(ప్రవేశించి) భృగునందనా! నమస్కారము.

పర—ఓహో, నీవా, రాముడవు? బాలుడవయ్యునుగ ఘనునువనంబున వృద్ధుడవే?

రాము—మహాత్మా! గర్వసుదనము మాత్రము నాకేమి తెలియును?

పర—ఏమీ, తెలియదా? వంకవంక దండముల బెట్టి నాకటాక్షము సంపాదించుకొని ప్రాణముల దక్కించుకొన జూచుట గర్వసుదనము కాదా?

రాము—మీవంటివారి పాదసేవ లెరిగిన గదా, అట్టి గర్వసుందనము దెలిసికొనుట.

పర—బళి, బళి, యుక్తముగ దుగను తరువాత నీవును జన్మించితివిరా; రాము;

రాము—మీకు నాయందున్న అనురాగ రసంబున నట్లను చున్నవారు కాని నాకు మీవంటివారితో సరిగ మాట్లాడుటయు దెలియదు.

పర—అబ్బా! ఎంత; వినయము; తెలియదేమి?

చం॥ తెలియనివాడవైన ముదిదేరినదాటకనున్ సుబాహుము
ఖ్యుల గడతేర్చినాడు రఘుకుంజరుడంచును నీదు మిత్రబం
ధులు నుతియింపగా మదముతో గనుగానక యుందువోక్కనీ
బలముచలంబు శౌర్యమును భార్గవరాముని మోలజూపుమా.

రాము—

చం॥ ఘనులకు దుష్ప్రవేశ్యమగు గోర్యముబూని నృపాలకంఠలుం
ఠనవ్రతదీక్షగైకొని కుఠారముహస్తమునందుదాల్చి రక్తవా
హినిబ్రవహింపజేసిన యహీనమహాగ్రహమూర్తి నీదుచెం
తను నసుబోటి రాముభుజ దర్పమదెంతమహానురాగిణీ.

పర—ఏమీ, రామా; యిదిస్తోత్రమా, నిందయా?

రాము—నింద యెట్లగును. స్తోత్రమే; నీవంటివాడు కాక యిట్టి యరాజ కర్మమున కే బ్రాహ్మణుడు సాహసించును.

పర—ఏమీ, సాహసింపడా! ఎవని తండ్రిని నిష్కారణముగా జంపిన ఎవడు పేచుసేయును?

రాము—అందుచేతనే ఎవడో, రాజ ధర్మముం బరిశీలింపక నీతండ్రిని జంపినందులకు ధరణినంతయు నిక్షాత్రము జేసెదనని గొడ్డలి ధరించి బయలు వెడలినారు. ఒక విషవృక్షమున్నదని కాంతారమంతయు ఛేదించినట్లు మూషికబాధ నడంచుటకు మణిహర్మ్యమును దగులబెట్టినట్లు చేసినారు.

పర—ఔరా; సాహసము. నన్నధిక్షేపించుచుంటివే?

రాము—భార్గవరామా; నిన్నధిక్షేపింప నేనెంతవాడను.

పర—అధిక్షేపించుటకాదా; యిది స్తోత్యమా;

రాము—రెండునుకావు. వాస్తవము వచించితిని.

పర—ఓరీ, మిథ్యా స్తోత్యవాదీ ! అనేక యుగములనుండియు వాడుకలేక పడియున్న శివచాపమును విరచినానని కనుగ్రొవ్వి నిందాగర్భవాక్యము లాడునిన్ను సైపజాల !

రాము—సైప కుందువుగాక. బ్రాహ్మణులకు గర్హ్యమైన అహంకారమును దాల్చినందులకు మిమ్ము జూచిన నాకు విచారమగుచున్నది.

పర—ఏమీ, మూర్ఖుడా ! నాబ్రాహ్మణ్యమునకు గొఱంత యగునని నీకు విచారము కలుగుచున్నదిగా ; అటులైన—

చం. క్షణమికసైపనేనుభుజసత్త్వముకల్గినవాడవేని, రా।
జనివహప్రాణసంచయముసర్గము జేరిచికీర్తిగొన్ననా
యనుపమవిష్ణుచాపమిదెయల్లనజేకొనియెక్కువెట్టుమా
ఘనునిగనెన్నువాడనినుగానియెడన్ దలద్రుంచివైచెదన్.

రాము—భార్గవా ; ఇట్టియహంభావము నీకు జెల్లదు. అయినను,

చం. ఘనతలకేమికాని కనుగర్వముతో దులదూగునీశరా
సనమిటుదెమ్మునీబలము శౌర్యము చందముగానవచ్చెడున్.

(భార్గముని చేతిలోధనువులాగుకొని)

గోణయము నెక్కువెట్టితిదిగో నిశితాస్త్రముగూర్చినాడ ; దే
నినివిదళింపగావలయు నిక్కము జెప్పగదయ్య భార్గవా.

పర—(భయాశ్చర్యములతో) హా, హా, హతాశుడను, హతవీర్యుడను, హతపౌరుషుడను, ఆశ్చర్యము, చిరుత ప్రాయపు రాచపట్టి నాచేతినుండి చాపమును లాగికొనుటలో నాసత్య శౌర్య పరాక్రమంబుల నాకర్షించుకొనినాడు. నేనిక బెండువంటి వాడనైతిని. యీతడు కేవలము రాచవాడుకాడు. నారాయణుండు, కావలయు. లేకున్న నన్నిట్లు నిర్వీర్యుని జేయువాడెవ్వడు. ఇక నాజీవనము వ్యర్థము. (ప్రకాశము) శ్రీరామచంద్రా ; ఆబాణమున నీయిచ్చవచ్చిన దానిని భంజింపుము.

రాము—అట్లు వలనుపడదు. నినిమిత్తము సంధించిన శరము నీపాదగమనశక్తినిగాని నీపుణ్యలోకప్రాపణశక్తినిగాని భేదింపవలయును-

పర—మహాత్మా! అపరాధము క్షమింపుము. నీవు చరాచర లోక గురుండవు. నారాయణుండవు. దుష్ట సంహారణార్థంబును శిష్ట పరిపాలనము కొఱకును అవతరించిన పురాణపురుషుండవు. సందేహములేదు. నాపాలిటి పుణ్యలోకములనే భేదింపుము.

రాము—(బాణమువిడచును.)

పరా—మహాత్మా! నీవు ఉపనిషద్వీధియందు విడంబించుపరబ్రహ్మంబవు. ముని మానస సరోవరంబున నీదులాడు ప్రణవ హంసరాజంబవు. ఇందిరానయన చకోర చంద్రుండవు. నీకు నేనోటునపడ యొకలెక్కలోనిది కాదు. స్వయంప్రకాశుండవైన నీవవతరించిన పిమ్మట నేనికనీధరణిలో సంచరింప రాదు. భవదీయ కరుణారసము నాపైజిలికి నాకనుజ్ఞ యిచ్చితివేని మహేంద్రగిరికి బోయి తపం బొనరించుచు జీవితశేషంబును గడపెదను.

రాము—భార్గవరామా ; మంచిది. అటులేపొమ్ము.

పర— (నిష్క్రమించును.

దశ—ఇప్పటికి రాజకుల మారకగ్రహము గర్వముడిగినది.

జన—అమ్మయ్యా ; నాప్రాణము లిప్పటికి బొందెలో ప్రవేశించినవి.

దశ—బావా, మిధిలేంద్రా; మీ రిక నిలచిపొండు. మాచిరంజీవివల
న రాజకులమునకు భీతి యడగినది. మేమిక అయోధ్య కఱి
గెదము.

జన—చిత్తము— (అందరునిష్క్రమించెదరు)





# రామపాదుకాపట్టాభిషేకము.

పంచమాంకము.

రంగము—వీధి—(మంధరప్రవేశించును.)

మంథ—ఆహాహా: ఏమి, ఈవింత పరిమళము; ఈ సుగంధ బంధుర మారుతప్రచారము లెందుండివచ్చెను. (కలయజూచి) అవిగో; విరిసిన పూవుంగుత్తుల తోరణములు. ఈపట్టంబట్టు లలంకరించుటకు గారణమేమో; అదుగో; తురంగ శకటముల నధిరోహించిపట్టణాలంకారికు లత్యాతురతతో నటునిటు సంచరించుచున్నారు. మా అయోధ్యాపురి నింత యలంకరించుటకు రాజకుమారుల జన్మదినమహోత్సవముల విలసిల్లు చైత్రమాసము కాదే; కాని ఏదో గొప్పమహోత్సవములు సేయునట్టుల మాత్రమలంకరించుచున్నారు. ఈయంశము నెవ్వని నడిగి తెలిసికొందును. అదిగో; కౌసల్యదాసి ధాత్రిక యిటు వచ్చుచున్నది.

ధాత్రిక—(ప్రవేశించును.) అదేమేకుబ్జా: ఆశ్చర్యముగా జూచుచుంచుంటివి ?

మంథ—ధాత్రికా; నీవన్నట్లు ఆశ్చర్యముగనే చూచుచున్నాను. కాని ఈ పట్టణ మిట్లలంకరింప గారణమేమే ?

ధాత్రి—ఓసి, వగలమారి వంకాయి: ఏమియు నెఱుగనట్లేఅడుగుచుంటివే;

మంథ—నేనేమియు నెఱుగనే, చెప్పుమా !

ధాత్రి—ఓసీ, పౌరులేకాక దేశదేశముల వారంద ఱెఱింగిన యంశ
ము నీకు దెలియదా ?

మంథ—నీతోడే, నాకు దెలియును. చెప్పవే ;

ధాత్రి—రేపటిదినమున మన కందరకు మహోత్సవము కలుగును.
మంచిమంచి బహుమతుల నందగలము.

మంథ—ఔనులే, మహోత్సవమునకు గారణమేమి?

ధాత్రి—యౌవరాజ్య పట్టాభిషేకము.

మంథ—ఎవరికి ?

ధాత్రి—అట్టి మహోత్సవ మింక నెవరందగలరు. మన శ్రీరామ
చంద్రునకు.

మంథ—ఏమీ, శ్రీరామునకా, రామునకా:

ధాత్రి—ఔను, శ్రీరామచంద్రమూర్తికి యౌవరాజ్యపట్టాభిషేకము
రేపటి దినంబున బ్రహ్మయోగంబున.

మంథ—ఆ, ఆ, (ఆశ్చర్య మభినయించును.)

ధాత్రి—ఏమే, పొట్టిదాన! అట్లు నివ్వెఱపడి కొయ్యబొమ్మ వైతివి?

మంథ—(పలుకక ఆలోచన నభినయించును.)

ధాత్రి—(స్వ) శ్రీరామ పట్టాభిషేక వార్తవినినంతనే మానవులేకాక
పశు పక్షి మృగాదులెల్ల తమసంతోషమును దెలుపుచుండ
నీదాసికింత వెగటై నదేమి? చెప్పుమా; సూర్యకాంతిని జూచి
సహింపలేక చీకటిలో దూరు గుడ్లగూబవంటిది యీకుబ్జ.
కనుకనే యింత యోర్వలేని తనము. హుం, యిట్టిదానితో
నాకేల? నేనుమా దేవిగారి సన్నిధికేగెదను?

(నడచును)

మంథర—ధాత్రికా; పోవుచుంటివా?

ధాత్రి—ఔను.

మంధ—యౌవరాజ్య పట్టాభిషేకమా; నీలిరంగు వానికి, నిజమేనా,

ధాత్రి—ఓసి, చండాలురాలా; రాముడు నీలిరంగువాడా! నీకింతకంటె వేఱొకయుపమాన పదమే దొఱకలేదా! ఛీ, ఛీ, నీకెట్టి సన్నిపాత జ్వర మావహించినదే; నీమోము చూడరాదు.

మంథర—ఓసీ, నీవు నా మొగము చూడకున్న నాకేమియు గొఱంత రాదు. కాని రామునకు బట్టాభిషేకము మాట నిజమేనా?

ధాత్రిక—నిజముకాక అబద్ధ మనుకొంటివా? తప్పక తేవు శ్రీరామచంద్రునకు యౌవరాజ్యపట్టాభిషేకము నిశ్చయముగ జఱిగి తీరును. సూర్యచంద్రాది గ్రహములు తలక్రిందులైనను జఱుగక మానదు. నేను పోయెదను—

(నిష్క్రమించును.)

మంథర—ఏమీ; సూర్యచంద్రాదిగ్రహములా! తలక్రిందైనను ఆమహోత్సవము జఱుగక మానదా; హుం, ఎట్లుజరుగునో చూచెదనుకాక, ఈకుత్సితురాలు ధాత్రిక తనరాణియైన కౌసల్యాదేవి సుతునకు రాజ్యాభిషేకముకదా యని, బొంగి బొర్లబడుచున్నది. నారాణియైన కైకేయిపుత్రుడైన భరతునకుగాక రామునకు, రాజ్యాభిషేక మనిన నే సహింతునా; దీనికెల్లైన విఘాతము గలుగజేసెదను గాక. దీనికేమి యోజనసేయుదును తొలుత మాకైకను సమ్మతిపఱుపవలెను. రాముడనిన నెంతో గారాబముగా జూచు కైక నామాటవినునా? విన కేమి; రాజ్యలక్ష్మి యఱచేత జిక్కనన్న సమ్మతింపని చెనటులు కలరా? అందును తాంత్రికవచనసుధారసమున ముంచి యెత్తగల నేను చెప్పిన సమ్మతింపకుండునా? మఱియు నేతలంచిన నిప్పులేనిచోట నిప్పును, బుట్టించెద. గగనమునకు నిచ్చెన

వేసెదను. పరిశుద్ధ మానసముల గలంచి మార్చెదను. సంక్షో భముల బుట్టించెదను. రామరాజ్య పట్టాభిషేకమును మాన్పె దను. కైక బుద్ధిని మరలించెదను గాక;—

(నిష్క్రమించును.)

రంగము—మందిరము—కైకశయనించి ప్రవేశించును.

మంథర—(ప్రవేశించి) అదిగో; మాదేవి కైక నిద్రించుచున్నది. సద్గుణ సంపన్నయు నిర్మలమానసయు నైన ఈమె చిత్తమును అసూయా భూయిష్టముగ జేయవలయును. అట్లు సేయకున్న నాపూన్కి నెఱవేఱదు. (ప్రకాశము) అమ్మా, కైకమాంబా! లెమ్మా. మూఢురాలా! ఇట్టి విప త్సమయమున నీకు నిద్ర ఎట్లు పట్టినదమ్మా?

కైక—(లేచి) ఏమే, మంథరా! విపత్సమయమా? అయ్యో; ఏమి యుపద్రవము వచ్చినది. నీకు సేమమా?

మంథ—నా సేమము నట్టేట గొట్టుకొని పోయినను నాకుగొదువలేదు.

కైక—అట్లయిన నెవరికి విపత్తు మూడినదే;

మంథ—ఏమని చెప్పుదు నమ్మా: మండు వేసగికాలమున నదిలోని జమువలె నీభాగ్యదశ యింకిపోవు సమయము తటస్థమైనది. నదియెఱుంగక హాయిగా నిదురవోవుచున్నావు.

కైక—నా నిదుర కేమికాని, ఏమి యాపద రానున్నదో, వేగజె ప్పుమా?

మంథ—యుప్పెన వచ్చుట, ఆపదకాదా;

కైక—అయ్యో; ఏమియుప్పెనయే; ఏపది పొంగినదే; విస్పష్టముగ జెప్పగదవే;

మంథ—ఏమి యుప్పెనయా! నామగడైన దశరధమహారాజు నేగీచి నగీటు దాటక నన్ను మికిలి ప్రేమించినాడన్న నీయుత్సాహ

మనియెడు కళ్యాణ ద్వీపమును ముంచివేయ అసూయా సము
ద్రము పొంగి చెల్లెలకట్ట దాటి యుప్పెనవచ్చినది.

కైక—అదియెట్లు; నాభర్త సూర్యచంద్రులు గతులు తప్పినను
అసూయను వహించి నాయుత్సాహమునకు భంగము గల్గిం
పను. ధర్మమార్గముం దప్పను.

మంథ—ఏమి, నమ్మకమమ్మా; అట్టివాడు కనుకనేనా; ఇపుడు నీస
త్తిని నిప్పులబోయుటకు సంసిద్ధుడైనాడు.

కైక—ఛీ, ఛీ, అమంగళములాడకుము.

మంథ—అయ్యో, వెఱ్ఱిదానా! కొంప దొంగలపాలు కావలసినప్పుడు
యజమానులకు నిద్రాదేవత ఆవహించినట్లు నీగౌరవ జీవన
మమంగళముకా నున్నపుడు నాహితవాక్యములు నీకమంగ
ళములుగ గన్పట్టవా?

కైక—అబ్బబ్బా; విసిగించుచుంటివే; ముఖ్యాంశమును జెప్పరాదా;

మంథ—చెప్పితినికాదా; గౌరవ వినాశన మని;—

కైక—ఆమాటనటుంచుము. దానికి గారణ మేమో చెప్పుము?

మంథ—(తనలో) ఇప్పుడేమిసేయుదును. ముందుగ నుపద్రవ జలం
బుచే దీనిమనోభూమిని దడుపకున్న నేనాటదలచిన విచార
బీజము వేళ్లు నాటుకొని మొలక యెత్తదుకదా; తొలుతనే
శ్రీరామపట్టాభిషేకమని చెప్పినచో మహాసంతోషమున మై
మఱచి పిమ్మట నేనెంత మొత్తుకొనినను నామాటయే చెవిని
బెట్టదు. అయిన నిట్లు చెప్పెదను.
(ప్ర) అమ్మా! నీమందమతియే కారణము.

కైక—మందమతినై ఏమిచేసితిని;

మంథ—ఇంకేమిసేయవలెను. అతి చనవిచ్చి అయ్యగారికి బానిస
దానివలె వతెంచితివి. ఇది యల్పురాలు కదాయని నిన్ను
దాసీపదంబున కనుప జూచుచున్నాడు.

కైక—నాకు దాసీ పదంబిచ్చు వారెవ్వరే?

మంథ—ఆ; అట్లెంచుక అహంభావమును వహింపుము. సుఖముగబ్రతుకుదువు. లేకున్న నావలెనే నీవును మఱియొకతికి దాసి—

కైక—ఆ, చాలిక. నోరుమూయుము. నామాటవిని కలత యుడిగి జఱుగనున్న విశేషమేదో చెప్పుము.

మంథ—నీకు దాస్యకారణమైన అంశమునెట్లు చెప్పగలను. పోనిమ్ము. చెప్పెదను. అనుభవించు దాసవునీవు. మధ్యనాకేల చెప్పనా;

కైక—చెప్పుము.

మంథ—కౌసల్యకు నీవు నమస్కరింప వలయు.

కైక—ఎందుచేత?

మంథ—ఆమె రాజమాతయగుటచేత;—

కైక—నేను మాత్రము రాజమాతనుకానా;—

మంథ—నీవు భానిసకు మాతవు. దాసివి. రాజమాతవు కానేరవు.

కైక—అదెట్లు?

మంథ—నీకుమారుఁడును నీవును బానిసలే. రాజమాత వెట్లగుదువు?

కైక—అదేమే;

మంథ—రాముఁడు రాజు. కౌసల్య రాజమాత.

కైక—ఏమీ, రామునకు రాజత్వము ప్రాప్తించునా; ఎప్పుడు.

మంథ—ఱేపటి దినంబున రామునకు యువరాజ్య పట్టాభిషేకము.

కైక—ఆహా, నిజమేనా! ఎంత చల్లనిమాట జెప్పితివే!

శా. మాముద్దుల్ కొమరుండు రాముఁనకటే మాజానకీభర్తకా
మామానేత్రచకోరచంద్రునకటే మావంశరత్నానికా
మాముంగొంగు పసిండిభంజికకటే మాపుణ్యపుందీవికా
భామా? మంథరఱేపురాజ్యమునకున్ బట్టాభిషేకంబకున్.

ఇట్టి సంతోషవార్తను దెలిపిన నీ వీమణిహారమును బహుమానముగా గొనుము—(హారమునిచ్చును.)

మంథ—(హారమావలబాఱవైచి కన్నుల నీరువెట్టుకొనును.)

కైక—ఏమే, మంథరా; ఏడ్చెదవేమి?

మంథ—చావలేక,

కైక—చచ్చుటకు నీకిప్పుడేమి వుట్టి మునిగినది?

మంథ—నా కరుణా స్వాంతమే నావుట్టి ముంచినది!

కైక—నీకరుణ ఎవనియందు జూపుటచే నిల్లు జఱిగినది?

మంథ—నీమీద,

కైక—నావలన నీ కేమి విపత్తు కలిగెను?

మంథ—ఏల కలుగదు? నీవే నాదైవమవనియుఁ బ్రాణంబవనియు దలచి నీకు విపత్తు వచ్చునని యెంచి నావుట్టిమునిగి నల్లేడ్చుచున్నాను. నీ కావిషయమై చీమకుట్టినట్లయిన లేదు. వట్టిమూర్ఖురాలవు. అవివేకినివి. కొండ పగిలి తలమీద బడుచున్నవు నైప గొంచెము దెలివి దెచ్చికొనవు. చెప్పిన గ్రహించ నేరవు. నీమీద నే ననురాగ ముంచుటచేతకదా! నా కీసంతాపము. నీయెడ నాకు దయయు భక్తియు లేకున్న నాకీదుఃఖము కలుగునా? కావున జేయునది లేక ఏడ్చుచున్నాను. నా సేవ నీకు నేటితో సరిపోయినది. నా కిక సెలవొసంగుము.

కైక—నెచ్చెలీ; నాయెడ నీకు దయయు భక్తియు గలదని యెఱుంగుదును. కాని రానున్న విపత్తేదో విస్పష్టముగ జెప్పుమా:

మంథ—చెవులులేని వారికి జెప్పిన నేమి ప్రయోజనము?

కైక—ఉన్నవి, చెప్పుము?

మంథ—అట్లైన వినుము. నీవు భర్తయెడల నత్యనురాగమును గనబఱచుటచే నిన్నల్పురాలినిగ దలంచి నీమగడు నీకుమారుఁడు భరతుఁ డూరలేని సమయముగ దలంచిరామునకుయౌవరాజ్య పట్టాభిషేకము సేయ దలంచినాఁడు. ఆతడు కౌసల్యాభిమాని

గనుకనే యిట్టి కపటము బన్నినాడని తెలివి కలదానవైన నీవు తెలిసికొనగలవుకాని నీవు ముందుకథ ఎట్లు నడచునో యూహింపగల తెలివి నీ చెంతలేదు. నామాటలా ? వినవు. ఇది యంతయు నా దురదృష్టము. ని స్నేమునవలయు. నీ నమ్మి యట్లున్నది. తన్ను నమ్మిన దాని నన్యాయము చేయుట ధర్మముకాదని అయ్యగారు సుంతైన దలంపలేదు. తుదకు నీమొగమున దాస్యవృత్తియే వ్రాయఁబడియున్నది. నీకొడుకునకు భరణ మిచ్చెదరు. సమస్తరాజ్యమును రాము డేలుకొనును.

కైక—ఓసీ, వెఱ్ఱిదానా! ఎంత ఆలోచనఁజేసితివే; నీవు శ్రీరాముని సద్గుణము లెఱుంగక యిట్లు పలుకుచున్నావు.

సీ. తనతల్లికంటె మించినభక్తి రామునందు
 ప్రియమారననుగౌరవించువాఁడు,
భరతునిదనయాత్మవలె జూచిప్రేమించి
 పరమహర్షమున గాపాడువాఁడు,
కౌసల్యసీతలు కనుముదంబునమమ్మ
 స్నేహప్రవృత్తిఁ బిక్షించువాఁడు,
ధర్మస్వరూపుండు దశరథభర్తయు
 నందఱనొకబుద్ధి నరయువాఁడు,
గీ. ఎవ్వరునుమమ్ముభేదప్రవృత్తిజూచి
వంతగుందించువారలెవ్వరునులేరు
చెలగురాముని పట్టాభిషేకమన్న
వసుధసంతోషమందని వారుకలరె.

మంథ—కటకటా ; కైకా ; నీకెంతటి మాఢ్యమే ; మాటలచే నెంతటి ప్రేమంబైన జూపెదరు కాని మూట నీయవచ్చినప్పుడా ప్రేమంబు కనుపడు ననుకొంటివా ? ఒకతల్లికడుపునబుట్టిన వా

రైనను పెద్దవాఁడు రాజ్యమేలుచుండ దమ్ముఁడు భరణముఁగొ
నుచు బ్రతుకలేకయేకదా దమలోదాము రణంబున బోరిచ
చ్చుట. రాజ్యకాంక్ష యెట్టిదో నీవెఱుంగవు. అధికారము కలి
గినప్పు డెట్టిభావము లుప్పతిల్లునో నీకు నుంతయు దెలియ
దు. సరిగ యొకకాసైన నన్యులు తినుట కిచ్చగింపరు. గర్వాం
ధులై కన్నుగానక సంచరించుచు బంధువుల బ్రజల మల
మలమాడ్చు చుందురు. నాకెందులకీ యడియాస. నీవు పోయి
జానకికి మొక్కవలసివచ్చినప్పుడు భరతుఁడు రామాజ్ఞయనెడి
సంకెళ్ళ దగుల్కొని పడరాని పాట్లు పడినప్పుడైన మంథర
మాటల వినకపోతిని కదాయని దుఃఖింపక పోవు. వేయి యేల?
యౌవరాజ్య పట్టాభిషేకమన్న సామాన్యము కాదుకదా!
రాజునకు నలుగురు పుత్రు లున్నపుడు అందిద్దరు పరదేశమున
నున్న సమయమున వారిని రావింపక యింత హఠాత్తుగ నిట్టి
మహోత్సవమునుదలంచిన వారుందురా? సుంత యోజింపుమా?

కైక—మంథరా; నాభర్తకేమో దుస్స్వప్నములు వచ్చినవట. అందు
వలన దనజీవితమునకు భంగము కలుగునేమోయను భయ
ముచేతను ఇంతలో మంచిహూర్తములు లేనికారణమునను
ఇంతహఠాత్తుగ దలంచినారట. అంతియేకాని మ మ్మన్యా
యము సేయదలంచినాడని నేనూహింపను. నీమాట లేమో
ప్రపంచకమును దలక్రిందుగ జేయుచున్నవి. నేనవివిశ్వసింపను.

మంథ—కైకా; నేతిబీరకాయలో నేయియున్నదని తలఁచు నమా
యికురాలవు. గనుక నీవాకృత్రిమమును దెలిసి కొనలేకున్నా
వు. రాజు నిజముగ తనజీవితము క్షీణించుచున్నదనియే యూ
హించినచో దప్పక భరతాదుల రావించుట ఆవశ్యకము
కదా; అట్లు సేయక ఇట్టిమహోత్సవము దలపెట్టుటయేటి

ధర్మము ? పోనిమ్ము. తాను బ్రతికి యుండగనే కుమారునిపై రాజ్యభారము పెట్టదలచిన ఇంతలోనే కఫము కుత్తుకకు జుట్టుకొని యిపుడో తేపో చావసిద్ధముగనుండ లేదుకదా ? ఈలో పున భరతు నేల రప్పింపరాదు ? ఇక మంచిముహూర్తములు లేవందువా ; భగవన్నిర్ణయమైన ముహూర్తమునకే ఏకార్యములైన జరుగునుకాని అయ్యేది వీరివశమగునా ? ఇది యంతయు పిచ్చియూహ. నీవు వట్టి అమాయికురాలవు. పురుషుల కపటవృత్తంబు లెఱిగినదానవు కావుననే చెప్పినను తెలిసికొనలేని నీ తెలివి తెల్లవారిపోయినది.

కైక—ఓసీ ; నీమాట లేమో కొంచెము నావదిం కెక్కుచున్నవి. కాని నాకేమో భయమగుచున్నది.

మంథ—నీవు భయపడకుము. ధైర్యము దెచ్చుకొని యీవిపత్సము ద్రమును దాటుము.

కైక—నాకేదియు దోచుటలేదు. ఈకార్యమును మఱల్చుటకు నాకేదియు నధికారము లేదుకాదా ;

మంథ—నీకధికారము కలదు. నామాటనమ్ముము. నేచెప్పినట్లు వింటివా, తెలిపెదను.

కైక—నాకధికారముకలదా ; అదేదో, తెలుపుమా ; నీవు చెప్పినట్లు అతిచంచలమనస్కులైన పురుషుల నమ్మరాదు. నీవు నా బాగుకోఱకు జెప్పుచున్నావు కాని యిందువలన నీ కేమియు లుకును.

మంథ—దశరథమహారాజుగారు తొల్లి శంబరయుద్ధమున నీకు రెండు వరము లొసంగియుండలేదా?

కైక—ఔను ; ఇచ్చి యున్నవాడు. అవసరము వచ్చినప్పుడు అడిగెదనని చెప్పియుంటిని.

మంథ—వాటి నిప్పుడు కోరుము.

కైక—మంధరా ; మంచిమాట చెప్పితివి. అందొకవరమును భరతు నకు యౌవరాజ్య మిమ్మని కోరెదను.

మంథ—అంతమాత్రమున పీలుపడదు. రెండువరముల నిప్పుడే కోర వలయు.

కైక—రెండవవర' మేదికోరుదును.

మంథ—ఒకటి భరతునకు రాజ్యాభిషేకము. రెండవది రామునకు దాపసవృత్తితోపదునాలుగేండ్లరణ్యావాసమునుకోరవలయును.

కైక—ఆ, రామునకా; పదునాల్గు గేండ్ల రణ్యావాసమా; కటకటా; పాపము, అట్టిందుల కేల? మహాఘోరముకదా;

మంథ—అదిగో; అప్పుడే పప్పులో నమగు వేయుచున్నావు. వాని నడవుల పాలొనర్చకున్న పురములో భేదబుద్ధిని గల్పించి భర తు నవల కీడ్పించి రాజ్యముదానేలు కొనును.

కైక—అయ్యో! ఆరాముడు సకల సద్గుణాభిరాముడు; కదా? అట్టి ద్రోహము దలంచువాడుకాడే!

మంథ—ఇది ధనాశ. ఎట్టి వానిచేతనైన ఎట్టికార్యములనైన జేయిం చును. నీకింతయు జ్ఞానములేకున్నది. నీవు యీవిషయమున గరుణ వహించితివేని నీనెత్తిని నిప్పులే; యోజించుకొనుము.

కైక—శివశివా; నేను దాసినగుదునుగాక; నాకొడుకు తిండిలేక చచ్చుగాక. సకలజగంబులందు మాననీయుడు రాముడని స్తుతించుచుండ నట్టిమహాపురుషున కరణ్యావాసవిధి విధింప నా నోరెట్లాడునే?

మంథ—పిచ్చిదానా; రాము డెట్టివాడైనగాక, రాజ్యముపై నాస యుండ దనుకొంటివా; ఇట్లు కోరుకున్న రాముడుపురమునందే యున్నపలువురు పోగై పెద్దవాడుండగా నీవు రాజ్యమేల దగ దని భరతునకు బోధింతురు. అప్పుడు నీకొడుకుసమ్మతించును.

నీవరంబు వ్యర్థమగును. నేచెప్పినట్లు కోరితివేని ఇతరులు చెప్పుటకును వీలులేదు. మఱల వచ్చిన పిదపనైన రాముడు రాజ్యముచేకొనడా అని తలంతువా? పదిరెండేండ్లు భరతునిచే బరిపాలింపబడిన రాజ్యమును రాముడు తిరిగి చేకొనుట కధికారములేదు. అందుచేతనే పదునాలుగేండ్లు మితిపెట్టితిని. కావున నీవిట్లుకోరుము. కోరకుంటివా, నీకర్మము. నీకును నాకును నేడే ఋణము తీఱిపోయినదని నేను లేచిపోయెదను. ఆ మీద నీపాట్లు నీవుపడెదవు. ఏమిచెప్పెదవు.

కైక—అటులేకోరెదను. నాయొడలు వడకుచున్నది. ఏమిమాటలాడ వలెనో తెలియకున్నది?

మంథ—నేచెప్పినట్లు వినుము. అలంకారముల దీసివైచి మాసిన చీర గట్టి చీకటింట శోకదేవతవలె నుండుము. నీమగడు నీచెంత కిప్పుడేరాగలడు. నిన్ను జూచి యిదేమిట్లుంటి వనియడుగును. నీవు పలుకకుము. నీకోరిక దీర్చెద. నీయలుకకు గారణమేమనును. నాడు నాకొసంగిన వరంబు లీయకన్ననన్యాయము జేసితిరని కల్లయేమ్పుల నేడ్వుము. అప్పుడుతప్పక ఇచ్చెదనను. ముందుగ బ్రమాణము జేయించుకొనియవల నీరెండువరముల గోఱుము. ఆయన వలదని యెంతబ్రతిమాలినను నీవుమాత్రము మెత్తబడకుము. పోమ్మా. ధైర్యమూను. ము

కైక—మంచిది. అటులేచేసెదనులే!

మంథ—అదిగో! లే, అనుచున్నావు. యిది యంతయు నీసేమమునకు గాని నాకొఱకుగాదు. భరతుని బకీరుని చేయకుము. దిట్టవు కమ్మా. పోమ్మా.

(కైకను లోపలకు గొంటుచు.)

ఇక్కడికి నాపూర్తిగా నెఱవేఱినది. (నిష్క్రమించును.)

## రంగము—కోపగృహము.

(కైక శయనించియుండ దశరథుడు ప్రవేశించును.)

దశ—ఇది ఏమికారణము చెప్పుమా?

సీ: పురమెల్ల శృంగారము నమించియుండ నీ
కైక మందిరమేమొ కాంతివాసె
ఆహ్వాన మొనరించునట్టి ధాత్రికగృహాం
గణమున నేడేమొ కనులబడదు
అనవరతంబు సౌఖ్యము గూర్చుజామర
గ్రాహిణి నేడేమొకానరాదు
నారాక గనియును శారికకీరముల్
కూయకమేయక కూర్కియుండె

గీ. ఏమికారణమో వచియింపజాల
గల్గలేదుకదా వంత కైకకిపుడు
అవని నాబాలగోపాల మధికముదము
జెందియుండంగ గైకకీ చింతయేల.

శ్రీరామునకు బట్టాభిషేకము సేయుదు రనుమాట ఈమె వినియుండ లేదేమొ! వినకపోవుగాక. నిత్యశృంగారముకూడ నీమె భవనమున లేకుంటకు గారణమేమియుండును. ఒకవేళ వినియు నీమెకిష్టములేకుండునా; మహర్షులకుపౌరులకుసకల దేశజనులకును సంతోషదాయకమైన రామపట్టాభిషేకవార్త ఈమెకిష్టము లేదనుమాటకల్ల. అట్లయిన నీమె మందిరమిట్లు దీనదశతో నుండుటకు హేతువేమి? ఇట్టిమహోత్సవము దలపెట్టి ప్రియురాలనైన నాచెవి నింత వేయడాయెగదా నామనోహ రుడని నింత నాపై యలిగి యుండవచ్చును. అట్లగుగాక; ఇంత విరుద్ధప్రవర్తనమా? అయినను కైకను సమీపించి,

యడిగి తెలిసికొను వఱకు ఇదమిద్ధ మని నిర్ణయింప జాలను. (వెదకి)ఇదిగో, ఇచ్చటకైక శయనించినది. ప్రాణేశ్వరీ!కైకా; ఏమి పలుకవు. ఓహో! ఈచీకటి చాటున శయనించుటచే నీమె కేదో పెద్దకినకయే వచ్చినట్లు తోచుచున్నది. (కైకను లేవదీసి) జీవితేశ్వరీ, నీకీ వేషమేమి?

కైక—మీరు నన్ను బరాభవించి నాకీ వేషమును అలవడజేసినారు. నేను మీకు జీవితేశ్వరిని కాను. శతృపురాలను.

దశ—హరి హరీ; నిన్ను బరాభవింపలేదే; నీకీ విచారమేమి?

కైక—పరాభవింపకేమి; అపరాధు లపరాధివని సమ్మతింతురా?

దశ—నిజముగ నపరాధమునే చేసినచో నేల సమ్మతింపరు. నే నే మపరాధము జేసితినో చెప్పుము. సవరించుకొందును. ఊఱక నీలో నీవు విచారించిన నేమిఫలము?

కైక—నా డెన్నడో రెండువరముల నిచ్చి క్రియకు సున్నజుట్టుట, అప రాధముకాదా; ఎఱుగరా?

దశ—అ హ హ హ (నవ్వి) ఇదియా నాయపరాధము. ఇప్పుడేమి ప్రత్యవాయము వచ్చినది. సమయము వచ్చినప్పు డడిగి పుచ్చుకొనెదనని చెప్పితివి. అందుచే నింతవఱకు జాగైనది. ఇందులకేనా; నీకిప్పు డింతవిచారము!

కైక—అటులైన నావరముల నిప్పుడిచ్చెదరా?

దశ—ఆ, సందేహ మేమి; ముమ్మాటికిని నిచ్చెదను.

కైక—ముమ్మాటికి నిచ్చెదనని నాచేతిలో చేయివేయుడు.

దశ—ఆ, తప్పక ముమ్మాటికేకాదు. వేయి సారులకును నీవరముల నిచ్చెద.

కైక—నేనడగిన పిదప మారుమాటాడరాదు సుడీ?

దశ—కైకా! నన్నింతనమ్మవేమి; నేనెన్నడైన మారుమాటాడితినా?

నీకోరిక జెప్పుము. తప్పకతీర్చెదను.

కైక—భరతునకు యౌవరాజ్యపట్టాభిషేకము సేయుట యొకవరము. రామునకు దాపసవృత్తితో బదునాలుగేండ్లరణ్యావాసము విధించుట రెండవ వరము.

దశ—హాకష్టము. కష్టము.

కైక—కష్టమో, నష్టమో. త్వరపడుము. సీతాపతి నిప్పుడే యరణ్యావాసమున కనుపపలయును. భరతుని బిలుపించి యాతనికి బట్టము గట్టుము.

దశర—ఆహా; ఇదేమి దారుణ దుఃఖము. నన్ను మ్రింగివేయు చున్నది. నా చెవులు బ్రద్దలైనవి. హా, దుష్కరము. భరింపజాల. (నిట్టూర్పువిడచి) అయ్యయ్యో, ఆడుపులిని జూచిన లేడివలె బోతిని. (కోపముతో) ఛీ! ఇది యాగ్రహమునకు సమయముకాదు. మంత్రిదుర్గమైన పన్నగంబనైతిని. అయినను నాయాగ్రహ మించుకంత వెలిసేయకున్న నన్నే మ్రింగివేయును. (ప్ర) ఓసీ, దురాత్మురాల;—

ఉ. ఎంతటి రాతిగుండెకలయింతివె నోరెటులాడెనిట్టి దు
ర్దాంతకఠోరవాక్యములనాడగ నీకు మదీయసత్కులం
బంతముజేయనాకు సతివైతివి పెంజలతాంచురీతినా,
స్వాంతముగాటుజేసితివహా, నినుబోలుదురాత్ములుందురే.

కైక—మీకంత కోపమెందులకు! వరము లీయవలసివచ్చెగదాయని యేనా! నేను నీకు వరములీయనే లేదనరాదా?

దశ—అట్లల యనవలయు. సర్వజన సంస్తుత చరిత్రుడైన రాముని యందేమి ద్రోహబుద్ధి కలదని ఇట్టి జగద్గర్హణీయములైన వరములడడిగితివి? కైకా,

ఉ. రామునినిర్వికారగుణ రాజితు దివ్యవిభుండటంచు నీ
భూమియు నాకలోంబు బెడ బొబ్బలువెట్టి నుతింపుచుండనీ

కేమియుపద్రవంబు ఘటి యించినవాడని మచ్చరింబున్
గాృమము వెల్వరించినది కానకుబొమ్మనె దీవుకోమలీ.

కావున నీవరంబ సర్వమని తలపోసి మఱొక్క వరంబడు గుము. భరతునకు నీవు కోరినట్లే పట్టాభిషేకము గావించె దను.

కైక—నాకు వేఱువరం బక్కఱలేదు. పలికిన మాటకు, మారు మాటాడిన దోషంబని యెఱింగితిరేని ఈవరంబునే యొ సంగుడు. పిల్లల గన్నతండ్రులు మీకే యింత పక్షపాతమున్న తల్లులకుండదా?

దశ—నేనేమి పక్షపాతము జేసితినో చెప్పుమా?

కైక—భరతుడు గిరివ్రజపురమున నుండుసమయ మరసి రాములకు సర్వరాజ్య మొసంగుట పక్షపాతము కాదా? ఇంత కన్న నేమి కావలయును?

దశర—నాకేమో అనేకదుస్స్వప్నములు వచ్చుటచేతను ముదుసలినా టచేనేను జీవించియుండగనే యౌవరాజ్యమునకు బట్టాభిషేక ము సేయుట సమంజసమని మునులు,పౌరులు చెప్పుటచేతను, తేపటి దినంబున బుష్యయోగము మంచిదగుటచేతను క ర్త యతడేకదాయని రామునకు బట్టముగట్ట స్థిరపఱచితిని. అంతి యెకాని నాకేమియు బక్షపాత బుద్ధిలేదు.

కైక—సరే; అన్యమార్గ మవలంబింప దలచిన వారి కనేక కారణం బులు దొఱకును. ఇట్టి మహోత్సవము దలచినపుడు భర తుడు వచ్చువఱకు నేల యాగరాదు?

దశ—అటులైన భరతుడు వచ్చువఱకు నీప్రయత్నము మానివేసె దను. నీకు యిష్టమేనా?

కైక—ఇప్పు డట్లుమార్చుటకు నేను సమ్మతింపను. భరతుడు వచ్చిన పిమ్మట బట్టాభిషేకము సేయవచ్చును. కాని రాము నిపు

దరణ్యావాసమునకు బంపివేసి నా రెండవ వరము జెల్లించ వలయును.

దశర—కట్టా: ఎట్టి కార్యము మనసు-రాలవే, కైకా; నీనోట నిట్టి మాట వెలువడు నప్పుడు భరతు డేయున్న నిను మనని చ్చునా?

కైక—సామ్రాజ్య భోగమంత చేదాయేమి? నాకొమరునకు నింతకును నేనేమి యకార్యకరణము జేసితినని నన్నుజంపును. మీరిచ్చిన వరముల నడుగవలదనుటకు వాడేమంత మూఢుడాయేమి? వరముల చెల్లించుటకు మీకిష్టము లేకున్న నట్లు విస్పష్టముగ జెప్పివేయుడు. నామగ డసత్యవాది యనినోటుమూసికొని పడియుందును.

దశ—కైకా! ఇది నీవు బుట్టిన బుద్ధికాదు. ఏకుత్సితులో బోధించి యుందురు. అటులేకాకున్న;

చం. ఇదివఱకెప్పుడున్ గడియయేనిరఘూత్తముజూడకుండనా
మదిసహింపదంచుబలుమాఱువచించెదుదానవిప్పుడీ
యదగితత్క్రౌర్యవృత్తిగనుటబ్బురమయ్యెడి నాకుసద్గుణా
స్పదవగు నిన్నునీకుటిల పంథనుద్రిప్పినద్రోహులెవ్వరే.

కైక—ఓహో; మీమాట లకర్థములేకున్నది. ఎవరి సౌఖ్యముల వారు చూచుకొనుట కన్యుల ప్రబోధములు కావలయునా? ఇంతచదువవలెనా; వరము లీయననరాదా? మాట నిలుపు కొనదలచిరేని రాము నరణ్యములకనుపుడు.

దశ—హా, కష్టము. ఆమాటల నాగర్భమును గాల్చుచున్నవి. మా రామమూర్తిని విడువజాల, కైకా! నాప్రార్థన మొక డాలింపుము.

మ. ధరణిన్ గోసలరాజపుత్రిని సుమిత్రిన్ బ్రాణమైనన్ మహా
ద్దురితన్ వీడుదుగాని సర్వజనవంద్యున్ రామునిన్ సద్గుణో

త్రరునిన్ లోకహితార్థ దృజించుటకు జిత్తంబొప్ప కుండెంగదా
తరుణీ! నేఁడు వరంబుగోరుము భవత్పాదంబులన్ మ్రొక్కెదన్.
(అని మ్రొక్కును.)

కైక—చాలు జాలు, చేతకాని మగవారలు సేయుచేత లిట్టివే; నా పాదము లంటకుము. ఇంతకంటె నేను వరంబుల నీయను, పొమ్మనరాదా?

దశ—కేకయరాజనందనీ; నన్నసత్య మాడుమనెదవా! అయశకీర్తి నీకు మాత్రముకాదా?

కైక—అనుదాని పాదములు బట్ట కన్న నన్రుతమాడిన మేలే; ఏమందువా?

చం. భరతుడు రామలక్ష్మణులవంటి కుమారుడు కాడెగంగలో
దోఁతికెనె! కోసలేంద్రసుతలో సముడాలను కానెనేను భూ
వరులకు బక్షపాతమతి పాపముకంటె పనత్యమార్గనం
చరణపు దోషమెక్కుడె వినంబెదిస్తు నను వంతగూర్పదే.

దశ—అహా; ఎంత యుపన్యాస మిచ్చితివే? పౌరులచే మహాస్థులచే స్థిరపఱుప బడిన యనంతరమునకదా; రామునకు యౌవ రాజ్యాభిషేకము సేయ బూనితిని. నాయొనరించు కార్యము నందు దోషమేమియునులేదే; నన్నేల పక్షపాతమతిగా గణించె దవు. రాజ్యమును భరతుడే ఏలుగాక; రామునకు వనవాస విధిని కోఁఅకుండరాదా; నాప్రార్థన వినుమా? నిన్ను యా చించుచున్నాను.

కైక—ఇంక నామాటల నా చెవిని బెట్టకుము. నా కిదివరకే వరము లిచ్చియున్నారు. వాటి వివరము లిప్పుడు గోరితిని. అట్లు చెల్లించుడు. చెల్లించ నందురేని నే నే నూతియందైన నుతికి బ్రాణముల బోగొట్టుకొందును. యిదినిశ్చయము.

దశ—ఏమీ, చచ్చెదవుగా! వలదు. నీకంత శ్రమవలదు. కూపమును గూడఖలంబు సేయకుము. నాఖడ్గముచేతనే నీశరీర భారమును వదల్చెదను.

చం. ఉవిదరో! మాపవిత్రభాకరకు లోదధినింకగజేయు బాడబా
గ్నివి కులధూమకేతువవు నీవొకసాధ్వివె! భర్తప్రాణవా
యువుల హరింపనెంచెడు విషోరగమా నిను నిప్డు చంపినన్
దవులునెనాకు బాపములు ధారుణి నిష్కలుషత్వ మందదే.

(ఖడ్గము బైకెత్తును)

కైక—చంపివేయుడు. మీ కేయాటంకమును కలుగదు. మీకోర్కె నెఱవేఱును. (తల వంచును)

దశ—(ఖడ్గ మావల బాఱవైచి)హా, మహాపాపుడను. స్త్రీ లతిసాహసలు. ఓ అహంకారమా; నన్నువిడచి యావలకు బొమ్ము. ఓశోకదేవతా! నీవున న్నావహించుము. మహాదురదృష్టుడను. నిర్భాగ్యుడను. కైకా! అపరాధిని; క్షమించుము. నాకడసారి ప్రార్థన మాలింపుము.

చం. భరతుడురాజ్యమేలినను పట్టణమందున నుండియింత యో
గిరమిడి రామమూర్తిని సుకీర్తి విశాలునిబుణ్యశీలుసా
దరమున జూడుమిట్టిసుకృతంబున మేలగునీకు లేనిచో
దురితమునన్కైకయను, దుర్యశమందెదవీవు భామినీ.

కైక—భర్త్రువరప్రసాదినైన నన్నిట్లు పలికిన మూఢజనుల మన్నుచేయించెదను కాని నావరంబుల విడచు దాననుకాను.

దశర—హా, దశరథా, దశరథా, భగ్నమనోరథా : నీబ్రతుకు వృథా, హా, వృథా, ఓ, పవిత్రపృథాలక్ష్మి,నన్నింక దివికనిపివేయుము. నన్ను మోయ నీకు మిక్కిలి భారము. భారము. అతిదుర్భరము. నావంటి పాపుని నీవు మోయజాలవు. మో

యజాలవు. నేను మహాపాపినినైన కైకేయి చేతిలోని తోలు బొమ్మను. రవివంశ మహామహోన్మూలన ప్రభంజనుఁడను. సర్వజనాభీష్ట విఘాతకుడను.లోకవిద్వేషుఁడను.హా, కుమారా; రామచంద్రా: పితృభక్తితత్పరా; నాముద్దులబిడ్డా! రామా! శ్రీ రామా! నావలన నీకెట్టియాపద రానున్నదిరా, తండ్రీ; హా, కౌసల్యావరకుమారా! జగన్మోహనాకారా! మహర్షులంద రు నారాయణావతారపురుషుఁడవని పొడగిన నిన్ను, పవిత్ర పాదధూళీలవంబున గౌతమపత్నిశాపమును బాపిన నిన్ను, ఛీ, ఛీ, నాబిడ్డను నేనట్లు పొగడ కొనరాదు. రామా; మదీ

యమనోహంస సంచారాబ్జా; రామా; రాక్షసవిరామా; విశ్వా మిత్రమనఃకామా; నిన్నొక నిముషమైన విడచియుండలేని యీనిర్భాగ్యుఁడు, దశరథుఁడు. నీతండ్రి కాడుకాడు; నీకుఘాత దలచినవాఁడు. అయ్యో, ఒకదినమా, వారమా, మాసమా, వత్సరమా,పదునాలుగేడులు,నీకు వైరాగివేసము వేసి ఫకీరును జే సిభయంకర జంతుభూయిష్ఠమైన గహనము పాలుసేయుచున్నా డుకదా; నాయనా: హా, కౌసల్యాగర్భశుక్తిముక్తాఫలమా; రామా; నేను నీమొగ మెట్లు చూడగలను. ఈదుర్వార్త నీ కెట్లు వినిపింపగలను.కట్టా: నేనెంతజగన్నింద్యుఁడను. నేనుపిద

ప లోకము నేమొగమున జూడగలను. నాకింక లోకముతో బనియేమి యున్నది. నాకిక స్వర్గయాత్రయేకదా; నావంటి ఘోరపాతకునకు స్వర్గముగూడ లభించునా; నరకమే ప్రాప్తి యగును. స్వయంకృత దుష్కర్మననుభవించెదను. హా, రామా; నన్ను గన్నతండ్రీ; రామభద్రా! హారామా

(మూర్ఛిల్లును.)

(రాముడు ప్రవేశించును.)

రాము—జనకా : మీకిదియేమివెట్టి? మాతల్లి కైకమాంబకు దయ రీయవలసిన వరములను నేను చెల్లించెదను. మీరు శోకంబు ను మానుడు— (సమీపించును.)

దశ—(రాముని గౌగిలించుకొని) హా, రామా, రామా

(మూర్ఛిల్లును)

కైక—నాయనా ; రామభద్రా, ఈయవలసిన వరములుకావు.ఎన్న డో మున్నిచ్చిన వరములే, దీనికెంతరాద్ధాంతము సేయుచున్నా రో, చూచితివా ?

రాము—తల్లీ, వరంబు లెప్పటివైనను పితరుల ఋణంబుదీర్చుటసుతు లకు విధినియమముకదా ; కావున మనఃపూర్వకముగ నేచెల్లిం చెదను.తండ్రికుమారప్రేమచేనన్నువిడచియుండలేక ఇట్లు విచా రము నందుచున్నవాడు. నీవించుకంతయు సందేహింపకుము.

కైక—నాయనా, రామభద్రా ! నీవిట్టి సుగుణరత్నాకరుడవుగనుకనే జగంబులు నిన్నింత పొగడుచున్నవి.

కౌసల్య—(ప్రవేశించి) సోదరీ, కైకా ;

సీ. నారనాతండ్రిశ్రీరామాయనుచుసంక
మందుజేరిచికొనినట్టిప్రేమ
రాముజూడగనె భరతునిచంకనుడింపి
యక్కునజేర్చుకొన్నట్టిప్రేమ
కథలజెప్పెదరారకన్నతండ్రీయని
యానందమునముద్దులాడుప్రేమ
గడియమైనను రామువిడచియోరువకలా
లించిమీగడలదిన్పించుప్రేమ

గీ. ఇప్పుడేమయ్యె వాఁడేమితప్పు
జేసినాఁడమ్మ కాంతారవాసశిక్ష
కేమికారణమమ్మ వాఁడింతతిండి
తినుటకై నను నోచడే తెలుపవమ్మ.

(సుమిత్ర ప్రవేశించును,

సుమి— అక్కా, కైకా! ఇదేమి అన్యాయమమ్మా; నీకుమారునకు రాజ్యమును గోరినఁ గోరుదువుగాక, లోకపూజ్యుఁడు, రాముఁడు తప్పేమి యొనర్చినాఁడమ్మా; అడవుల పాలుసేయుచున్నావట?

కైక— సుమిత్రా! నీవు నాకు హితవుల జెప్పఁదగవు. నోరుమూయుము. కౌసల్యా; నా ప్రేమ ఏమయ్యెనో? యెఱుఁగవా; నాసుతుండూరలేనట్టి సమయముం గనిపెట్టి నీసుతునకు యౌవరాజ్య పట్టాభిషేకము సేయించుకొను బుద్ధి నీకెప్పుడు కలిగినదో, అదిగో, అప్పుడే, ఆగాలిచేతనే నా ప్రేమంబులన్నియు నట్టేట బడి కొట్టుకొని పోయినవి. తెలిసినదా! ఒక్కొక్క యాఁడుది చలిచీమనైన ద్రొక్కనట్లు నంగనాచివలె నటించి మగనిని జేబులో వైచికొని తనకుపచరించు గార్యముల నెన్నిటినో చేయించుకొనును. నావంటి తెలివిహీనురా లట్లుసేయుట చేతకాక ఆపద తలమీఁద బడినప్పుడు కొంప మునిఁగిపోయినట్లఱచి నోరుచేసికొనును. అందుచే గొందఱు కైకగయ్యాళి యని యాఱడి పెట్టుదురు. పోనిమ్మంత మాత్రమున నాకేమియు నపకీర్తిరాదు. మున్నెన్నఁడో శంబర యుద్ధమున సాయము జేసిననాఁడు నామగఁడు నాకీ రెండువరంబుల నొసంగినవాఁడు. వాటి నిపుడు చెల్లింపుఁడని కోరిన నింతరాద్ధాంతమా; ఇంత అల్లరియా; భర్తగారావిధమున దుఃఖపడుట యెందులకు? నీవిట్లేడ్చుచు కన్నీళ్ళచే నాకాళ్లు గడుగుట యెందులకు?

ఈసుమిత్రి యిట్లు చక్కట్లు చెప్పుట యెందులకు? నన్నింత రవ్వల పాలుసేయుటకు కాని;—

సుమంత్రుడు—(ప్రవేశించి) అమ్మా, కైకమాంబా; రాజ్యమును భరతుడేలుగాక; నిరపరాధియైన రామమూర్తి కిట్టిశిక్ష విధించుట యేటిన్యాయము? తల్లీ! వరంబులను మంచికోరికల దీర్చుటకుకాని ధర్మేతరకార్యముల సేయుమనుటకాదు. కటకటా; నీకెట్లు తోచెనమ్మా! లోకసమ్మతుడు, లోకారాధ్యుడునగు రామమూర్తి దివ్యమహిమ నుతింపని జీవకోటిలేదే; అతడు నివసించిన ప్రదేశము వైకుంఠమే; ఆతని దర్శనభాగ్యమునకై మహర్షులు తపము సేయుచుందురే? అట్టి పురుషోత్తమునకా, నీవరణ్యావాసశిక్ష విధించుట.

కైక—సుమంత్రా; యుక్తాయుక్తములు లేక రాజమహిషులకు గూడ వగవుల దీర్చెదవుగా; నీవునోరెత్తకుము.

రామ—సుమంత్రా; తల్లులారా, కౌసల్యాసుమిత్రలారా, నామాటల నాలకించుడు.

మ. గురునాజ్ఞన్ దలదాల్చియీజగతిలోకుల్ మెచ్చబాలింపగా
భరతుండే నునుగర్తతౌదుముకదా భావింపగా తమ్ముడీ
ధరణీరాజ్యమునేలు నేనఖిలకాం తారాళి రాజ్యంబునున్
బరిపాలింతుము దీనికింత వగవన్ భావ్యంబెశాంతింపుడీ.

దశర—(లేచి) హా, రామా, రామా, నీగుణంబులు శ్లాఘాపాత్రంబులు కదోయీ, తండ్రీ! ఈనిర్భాగ్యపు దశరథుని, ఈకుమార సౌఖ్య విఘాత కారకుని, ఈపాపిష్ఠిచరిత్రుని యొక్కమారు కౌగలించుము. నాయనా;

రామ—(తండ్రిని కౌగలించును.)

దశర॥ శా. అన్నా! కూరుడ గామినీవచనపాశాధీనుడన్ నిన్ను నా
పన్నుం జేసినదుర్మదాధుండనునా ప్రాణంబవో నిన్ను వీ

డన్నాయిూతను వేలకాల్పనోకో? కట్టా! ఎట్టిదుష్కాలమా
సన్నంబై నను గాల్పజొచ్చెనుకదా, చండాగ్నికీలాభమై.

రామ—జనకా, నీవు విచారింప వలసిన అంశమేలేదు.

చం. కడుపెటులైననిండు సిరిగాంచగవచ్చును భోగభాగ్యముల్
పడయుగవచ్చు దుష్టతమ వర్తనులౌదనుజాళిజంపియా
పుడమిభరంబడంచి ముని పుంగవులన్ ముదమందబ్రోచి పే
ర్వడయుటమాటలే సుకృతపై భవముండిన గాక లభ్యమే.

కైక—రాముడు తగిన ధర్మమును గనిపెట్టినాడు. అందుచేతనే అం
దరును సుగుణగణాభిరాముడని యందురు. నిజమాలోచింప
నుపద్రవకరమైన ధరణీరాజ్యముకంటె కాంతారరాజ్యమె సుఖ
ప్రదమైనది. ఆయంశ మెఱుంగక యిూమునిరాజును వీరును
దుఃఖపడుచున్నారు. రామా, ఇంకనూ ఆలస్య మెందులకు?

రాము—తల్లీ! ఇపుడేపోయెద నించుకసేపు తాళుము.

(లక్ష్మణుడు ప్రవేశించును.)

లక్ష్మ—అన్నయ్యా; ఎక్కడికిబోయెదవు? ఆగుము.

మ. అదయుండై సతిలోలుడై నినునరణ్యావాసమంపింప నీ
ముదిరాజెంతటివాడు పొమ్మనగనీ మూఢాత్మయా కైక యె
ట్టిది రాజ్యంబుపరిగ్రహింప భరతుండేపాటివాడయ్య దు
ర్మదు రాలైకనుజంపి మీాకిపుడె సామ్రాజ్యంబు చేకూర్చెదన్.

రామ—తమ్ముడా! ఏమా, తొందర;

ఉ. ఎందులకీదురాగ్రహ మభీష్టవినాశము పాపపుంజమున్
జెందగజేయు జ్ఞానమునశించు మనస్థిమితంబు మాన్పు మే
నుందహియించుస్వప్నమునను దలపెట్టగరానికోపముం
బొందుదువే స్వగౌరవము పూర్తిగమాయదె వెఱ్ఱితమ్ముడా.

కావున శాంతించుము.

లక్ష్మ—అన్నయ్యా; నాయపచారమును మన్నించుము. కాని నా మాటకు బ్రత్యుత్తరం బొసంగవలయును. తండ్రిగా రీమె కెన్నడో రెండు వరంబుల నిచ్చినాడన్నమాట సత్యమే యగుగాక. యిప్పుడీమె తనవరంబుల చెల్లించుమని యడుగుగాక. ఆవరంబులు సకలజనసమ్మతంబులును ధర్మవిశిష్టములుగా నుండవలయునేకాని అగ్రజుడు అర్హుడైన వాడుండగా తమ్మునకు పట్టాభిషేకమా; అదియట్లే యగుగాక. జ్యేష్ఠుడవైన నీకరణ్యవాసవిధి కోరుట యేటిధర్మము? అందుదాపసవేషము ధరించవలయునట, నేడేయరణ్యమునకుబోవలయునట, యిక్కడి కెన్నివరంబులైనవి. ఇట్లు కోరుట యేటిధర్మము? ధర్మ సాస్త్రములు, మహర్షులవాక్యములు, పౌరులసమ్మతియు, జగంబుల నిర్ణయములు నివియన్నియు నొకయాడుది, ఏ దుర్బోధము వలననో తెలివిలేనిదై పలికినమాటలకు దీసిపోవలసినదేనా; ఈ యమంగళాధర్మపద్ధతికి నీ వంగీకరించి యడవులకు బోవలసినదేనా?

రాము—లక్ష్మణా; మనతండ్రి తల్లికి దొల్లి వరంబుల నిచ్చినమాట సత్యము. వాటిని మనతల్లి యిప్పుడు చెల్లించుమని కోరినది. అట్లే తప్పక చెల్లింతునని తండ్రిగారు శెలవిచ్చినారు. అమ్మ యీవిధములైన వరములు కోరినది. యిప్పుడు కొమరుడనైన నేను తండ్రిగారి ఋణము దీర్చుట విధి. ఇది యంతయు బురాకృత కర్మవలన జఱిగినదికాని అన్యముకాదు. యిందులకై మనము చర్చసేయరాదు.

లక్ష్మ—అన్నయ్యా! ఎంతటియధర్మము. ఎంతటిదుష్కర్మము. నీ విందులకు సమ్మతించుట నామతము కాదు. అటులేమైన;

ఉ. భోగిశయానతుల్యుడవు పుణ్యుడ వార్యహితుండవైననీ
వే గహనాధివాసమున కేగగ దుర్విధికల్పితాగ్నికి

లాగణదగ్ధమానస విలాప విఘూర్ణిత ధారణీస్థలీ
భోగములేలనాఁగు వనభూమికి దోడ్కొని పొమ్ము నన్నికన్.

మిమ్ముఁబాసి యొకక్షణమైన నే నీపురమున నుండజాల.

రాము—తమ్ముఁడా! నీభ్రాతృభక్తికి మెచ్చితిని. ఇనుము వలన అగ్నికి గూడ సమ్మెట పెట్టులన్నట్లు నావలన నీకుగూడ నీకాంతార వాసశ్రమమేల? రావలదుసుమ్ము.

లక్ష్మ—అన్నా! ఇంతనిర్దయజూపింతువా; నీవు వలదని వారించి యేగినను బలవంతమునవైన ప్రాణముల ద్యజింతునుకాని యీయధర్మపురమునజీవించుదునా? నాప్రార్థన మాలించుము. తోడుకొని పోవుదునని అభయ మిచ్చువఱకును మీపాదంబుల విడువను. (పాదములపై బడును.)

రాము—లక్ష్మణా! అటులే నావెంట వచ్చెదవుగాక. లెమ్ము.

కైక—(స్వ) అమ్మయ్యా, రాముడేగగనే యీలక్ష్మణుడు పట్టలేని యాగ్రహమున నన్ను మట్టుబెట్టునేమో యని భయపడు చున్నదాన. ఈపీడ కూడవదలి పోయినది.

(సీత ప్రవేశించును.)

సీత—హా! ప్రాణేశ్వరా!

సీ. మనపెండ్లినాడు కట్టిన యట్టి మధుపర్క
ముల పచ్చ రంగింక దొలఁగలేదు
కళ్యాణ విధియందు కట్టినకంకణ
మ్ముల యానవాలింక బోవలేదు
పుణ్యాంగనల్ పసపులు నల్గు వెట్టిన
మాఁగుడులింకను మాయలేదు
మాకందలేదు సంభావనయనుచు బ్రా
హ్మణులింక వచ్చుట మానలేదు

గీ. ప్రేమమీరఁగ సిగ్గును విడచి కనుల
విప్పి ప్రాణేశ్వరాయని పిలువలేదు
యింతలోపలనే మనకీవియోగ
దశతటస్థించుననినేను తలఁపలేదు.

రాము—దేవీ! చింతిల్లకుము. నీ యోగ్యతకు దగినంత కీర్తి ధనంబును సంపాదించుకొని వచ్చి నీమనఃప్రియంబును సేయుదును. మగఁడుప్రతిష్ఠావంతుఁడైనగదా, మగువకు శోభకలుగుట.

సీత—నాధా; అట్లేకాని దుస్స్వప్నము ననుసరించి నేనిప్పుడు తమ యెదుట మాటలాడవలసి వచ్చినది. క్షమింపుడు.

గీ. చంద్రుననుసరించు చంద్రికవిధమున
పతిని బాయకుండ సతియుఁడుట.
ధర్మమనుచు జెప్ప తాపస వాక్యముల్
వ్యర్థపఱచి మిమ్ము బాయఁగలనే.

కావున నెన్నియాపదలు వచ్చినను భర్తను విడచి సతులింట నుండుట ధర్మముకాదుకదా! మీవెంట నన్ను గూడ నడవులకు గొంపోండు. నాప్రార్థనమును మన్నించుఁడు.

రాము—సాధ్వీమణీ! అది ధర్మమే కాని;—

సీ. పాషాణకర్కశపంథాటవీ భూమి
రేల బవళ్ళు జరింపలేవు
క్రూరశార్దూల మృగారావములకీవు
గుండెలు తలడిల్లకుండలేవు
పనరెక్కనట్టిపర్వతవులోయలనీరు
సేవగింపకనీవు తాగలేవు
వన్యంబులైన దుంపలమెక్కియాపోవ
కున్న నాకట కోర్చియుండలేవు

గీ. కుసుమ కోమలివీవెడ ఘోరజంతు
సంకులారణ్య భూమిసంచారమేడ
గటకటా; నీవుపడునట్టి కష్టములను
గాంచి యోర్వఁగ గలనెయోకలికిమిన్న.

ప్రియురాలా! నా అరణ్యావాస కష్టముకంటె నీపడు కష్టముల గాంచిన సంతాపమెక్కుడగుగదా; కావున నా వెంట రావలదు. నిన్ను మాయమ్మః చూచుచుండుటచే నన్ను బాసిన వంత సుంత బాసియుండ గలదు.

సీత—ప్రాణేశ్వరా! మీవంటి రఘుకులచంద్రుని పత్నినై యుండియు సాధ్వీధర్మముల నెఱవేర్పలేని దాననై తినికదా యనుచింత నన్నెక్కుడుగ దహించును. అంతియేకాక అధికకష్టభారము నహించు మీచెంతనే యున్న నీకు గొంత యూఱట కలుగును. భర్తతో ననుభవించు గష్టములైనను పడతులకు సుఖకరములై పరిణమించును. అంతియెకాక:—

సీ. మనలక్ష్మణుండు దుంపలదెచ్చియీయవా
టినివంటజేసియొడ్డించుదాన
మీశ్రమమ్ముతీఱసౌమిత్రివిసరుచుండఁ
బత్తిమీపాదంబులొత్తుదాన
అతఁడుపత్రకుటీరమలవఱింపగగంప
చీపుఱుచేబాగుచేయుదాన
ఊర్మిళాపతితోవనన్నవుండ్లనునీయ
గేలరాళ్ళనునొత్తిగించుదాన

గీ. మీరువచ్చినమునులను గౌరవింప
దెబ్బునసుపాద్యజలమునందిచ్చుదాన
తోడుగాలక్ష్మణుండున్నవాఁడుకాడె
నీడగానన్నుగొనుముమన్నింపుమార్యా.

నాథా; అర్ధాంగి వెంటనున్న మగవానికెన్నికష్టము లలమిన ను శ్రమ యనిపింపదు. నన్ననుగ్రహింపుము.

రాము—ఔను; నీవు వచ్చినందున సుఖములు కష్టములుగూడ నున్న వి. నిన్ను నడిపింపలేక నీకష్టముల జూడలేక నిన్నొంటి విడిచి వెడలలేక మిక్కిలి తపించుచు వనవాసవ్రతవిధికంటె నెక్కుడు సంతాపముబడుచు గాళ్ళకు సంకెలల దగిలించుకొనివానివలె వ్యథ పడవలసివచ్చును. పురుషుం డొంటిగబోయినచో నెం దు సంచరించుచున్నను తినినను తినకున్నను నవయుచున్నను విచారములేదు. కాని శ్రమనందు సమయమున నర్ధాంగి వెం టనున్న గొంత యూఱటగలుగుట నిక్కము. అయినను నీవా శ్రమనందుట నాయిష్టముకాదు.

సీత—జీవితేశ్వరా : మీమాట జవదాటిన దోషము నన్నంటకుండు గాక ; మీమాట కెదురాడితినని నన్నుగ్రహింపవలదు. నన్ను క్షమింపుము, నన్నుగూడ మీవెంట గొనిపొండు. అనుగ్రహింపుము.

రాము—ప్రియురాలా: అట్లే నావెంట గొనిపోవుదును. వంతమానుము

సుమంత్రుండు—(ప్రవేశించి) స్వామీ ; రామచంద్రా ?

చ. హృదయమవీవయీజగతికెల్లను నీపయిభక్తిలేనిదు
ర్మదుడొకండున్ గనంబడడుమాదురదృష్టముచేత నిట్టియా
పదఘటిల్లెనీవు వనవాసముసేయగమాకు సౌఖ్యసం
పదలవియేలమీవెనుకవచ్చెదమయ్య యనుగ్రహింపవే.

(తెరలో) హా, శ్రీరామచంద్రా; మమ్ముగూడ నీవెంటగొనిపొమ్ము.
నిన్నుబాసి మే మీయన్యాయరాజ్యముననుండజాలము.

రాము—సుమంత్రా : నీవలెనే పౌరులును నావియోగమునకు సహింపలే మనుచున్నారు. మీరందరును వచ్చిన నిక్కడి రాజకార్యము లెట్లు జఱుగును. ఓపౌరులారా :

ఉ. చింతిలబోకుడయ్యమునిశేఖరుజన్నముగావబోయినే
నెంతనెవచ్చితో యెఱుగరే: అటులీపదునాలుగేడులో
క్కింతతుణంబులోగడిపియిందు వసించినరీతిగానెయే
తెంతునునాదుతండ్రికి విధేయులరై ననునంపకోరెదన్.

కైక—రామా: సుమంత్రాదిమంత్రులును పౌరులును నీయెడ భక్తి
గలిగినవారగుటచే నీవేగిన పిమ్మట నాకొమరునిజూచి యోర్వ
లేక యెట్టి యాపదను సంఘటిల్లజేతురో యని సంశయించుచు
న్నాను. కావున నీవు వారికి హితవుచెప్పి పొమ్ము.

రాము—అమ్మా; అటులేచెప్పెదను. తల్లులారా; కౌసల్యాసుమిత్ర
లారా; సుమంత్రాదిమంత్రులారా; పౌరులారా; మీరందరు
నావిజ్ఞప్తిని మన్నింపవలయును. ఏమందునా ;—

ఉ. కైకమ దుష్టురాలునడికానకురామునిదోలెనంచుమీ
రేకడనైన బల్కవలదింతయు నన్నెటుజూచినారొ య
ట్లేకము బ్రేమతో భరతునెప్డును భక్తినిజూచుచుంటయే
నాకు హితంబటంచును మనంబున నెంచుడిమీకు శ్రేయమౌ.

కౌసల్య—నాయనా! రామభద్రా; ఇది నా పురాకృత దుష్కర్మ
ఫలము కాని కైకమ్మ దోషమేమియునులేదు. మేమామెను
నిందించు వారము కాము. పంచప్రాణములు నీయెడను నిల్పి
యున్న నీతండ్రి నీవియోగము భరింపలేక ఎట్టి దుస్థితిపాలగు
నో తెలియదు. నాయాత్మసంతాప మిట్టిదని తెలుపజాల.
నాయనా; రామభద్రా; మమ్ము విడచిపోయెదవా; రామా;
నీవిశ్లేషము నెట్లు భరింపగలమురా ; తండ్రీ !

రాము—అమ్మా ; తండ్రిగారికేమియు భయములేదు. నీవైనను శో
కింపక నాకు సేమమును గోరుచుండుము.

చ. అనయముతల్లిదండ్రులపదాంబుజ సన్నిధినుంటకంటెగా
ననములకేగుచున్ మునిజనంబుల కెగ్గొనరించుదైత్యులన్

దునుముచుభూభరంబడచి తోరవుగీర్తిధనంబుగాంచుటల్
తనయులకెల్లముఖ్యమగు ధర్మముగాదె సమస్తభంగులన్.

సుమి—నాయనా ? అది యథార్థమైనను పుత్రుని నెడబాసి యుండుట తల్లులకు సంతాపకరముకదా ;

కైక—రామా ! ఎంతవరకీ కాలయాపనము. మంధరా ; వీరికి వేగ నారచీరల దెచ్చియిమ్ము.

మంధ—చిత్తము—(వల్కలముల దెచ్చి రామాదులకిచ్చును.)
(రామాదులు ధరించివచ్చెదరు.)

సుమి—కుమారా; లక్ష్మణా; నీవును రామభద్రునితో ప్రయాణమగుట చే రాముడు వనవాసమున కేగుచున్నాడన్న విచారమునం దునగమంతరించినది. మఱియు,

గీ. రామునిన్ దండ్రియౌ దశరథునిగాను
యీవిదేహేంద్రపుత్రిని మావిధమున
నుగ్రకానన భూమినయోధ్యగాను
తలపు మాపూజ్యుల సతంబు గొలువుమన్నా.

లక్ష్మ—అమ్మా; అట్లే వర్తించెదను.

కౌసల్య—లక్ష్మణా ; నీయన్న రామునియందు నీకెంతటి భక్తికల దురా ! పురాకృత పాపఫలం బనుభవింప రామునకు విధి యగుగాక ; అయ్యో ; బిడ్డా ; నీతల్లిని విడచి ముగ్ధయైన యూర్మిళను విడచి ఆత్మసుఖము ద్యజించి నీకేల ఈకష్టము ; తండ్రీ ;

లక్ష్మ—తల్లీ ! ఆజగత్పూజ్యుడు, ఆలోకనాథుడు, మాయన్నశ్రీరాముడే యడవులకేగుచుండ నేనా ఈస్మశాన సదృశాయోధ్యాపురంబున గాపురంబుండుట. మీరందరు దురదృష్టవంతులగుటచే దూరస్థులగుచున్నారు. నే నామహానుభావుని సన్నిధి నుండుటచే చరితార్థుడను. కృతార్థుడను.

రామ—తమ్ముడా! పౌరులకు మాఱల నావేశము గొల్పకుము. లెమ్ము. తల్లులకు నమస్కరించి యనుజ్ఞ వడయుము.

లక్ష్మ—తల్లులారా; మీకివే వందనములు. మ మ్మాశీర్వదించి యర ణ్యవాసమున కనుపుడు.

రామ—తల్లులార; మమ్మాశీర్వదింపుడు. పోయివచ్చెదము.

కౌసల్య—బిడ్డలారా; సుఖంబున బోయిరండు. మిమ్ము మనయిల వేల్పులు రక్షించుగాక;

సీత—అత్తలారా; పోయివచ్చెదము. (నమస్కరింపుడు)

కౌసల్య—అమ్మా; సుఖంబున బోయి రమ్ము. నీవు ధన్యురాలవు.

రామ—తమ్ముడా! మన వియోగదుఃఖము సహింపలేక తండ్రిగారు మూర్ఛిల్లినారు. వారిని మేలుకొల్పకయే ప్రదక్షిణ నమస్కా రము లాచరించి పోవుదము.

అందరు—(నమస్కరించును)

దశర—(లేచి) హా, పుత్రులారా; రామలక్ష్మణులారా; అమ్మా; జానకీ; (అందఱిని తడవి కన్నులనీరు వెట్టును)

కైక—సరిపోయినది. వారిని పోనీయరా; ఏమి?

దశర—హా, నిర్భాగ్యుడను. హా, పుత్రులారా! (మూర్ఛిల్లును)

రామ, లక్ష్మ—(పాటపాడుచు ప్రదక్షిణముచేసి పగుదురు.)

(తెరపడును)





# రామపాదుకాపట్టాభిషేకము.



## షష్ఠాంకము

రంగము—మార్గము



భరతశత్రుఘ్నుల ప్రవేశము.

భరతు—తమ్ముడా, శత్రుఘ్నా; నిన్నటి దినమున సామంత రాజభటులమూలమున మనకు జేరిన జాబుచూచి నప్పటినుండియు నాతలమీద నేదో పెద్దకొండ విఱిగిపడిన ట్లున్నది. హృదయము చెదఱి పోయినది. అందే సేమము దెలుపక చూచిన వెంటనేరమ్మని యుంటచే నెవరికే కీడు మూడినదో, యనినామనసు తల్లడపడుచున్నది. రేయియంతయు దుస్స్వప్నములతోడనే కడచినది. మన మికనెట్టి యమంగళము విననుంటిమో కదా ?

శత్రు—అన్నయ్యా : ఇదిగో, గొప్ప యాపదయే తటస్థించి నట్లున్నది. అట్లే కానున్న సర్వంసహా భారకుముండైన తండ్రిగారుండ, తండ్రియంతటివాడు అన్నగారు భువనత్రయసంస్తవనీయుడు, శ్రీరాముడుండ, అతనికి కుడిభుజమై సర్వకార్యనిర్వాహకుడైన లక్ష్మణుడుండ, పురోహితులు వశిష్ఠుల వారీజాబు వ్రాసినా రనుటతోడనే నాగుండె పగిలిపోయినది. ఎట్లు నిర్ణయించుటకును వశము కాకున్నది.

రాము—తమ్ముడా ; శత్రుఘ్నా : ఇందును బట్టి యోజింప.

చం॥ జనకునకో మహాత్మరఘు సత్తముడన్నకొ అట్లుకాకల
క్ష్మణునకొ యేరికోహృదయ సంకటమా వ్యథకల్గియుండు నై
ననుపయి ముప్పొరందొకను నాకొకలేఖను వ్రాయరాదొ ప
మనిమదినెంతు ముప్పొరకు వాపదమూడెనొ తోచదేమియున్.

శత్రు—నీ వన్న ట్లాముప్పొరకును లేఖ వ్రాయుటకు వీలుకేని కార
రణమేదో కలిగియున్నది.

రాము—ఔను ; అట్లేతోచుచున్నది. ఆవంక జూడుమా ;

ఉ॥ ఆకసమందు గన్పడెను నానిరిధూమము బైలుదేఱెన్
గాకులు స్నానమాడుచును కావనియేఱ్చుచు నుండెనక్కటా
కూకలిడంగ జొచ్చెనవిగో విహగంబులరోదన ధ్వనుల్
నాకదియాత్మ బంధువుల నాశన హేతువుగాగ తోచెడున్.

శత్రు—అన్నయ్యా ; మన మిక్కడ నేమియు స్థిరపఱప జాలము.
క్రమంబుగ బురము బ్రవేశించిన సర్వము దెలియగలదు.
కావున నడువుము.

భర—తమ్ముడా ; అడుగు సాగదుగదా, పురప్రవేశము.

ఉ॥ చెప్పగరాని మంటయెదొ, చిత్తమునుం గమలింపజొచ్చెగన్
రెప్పలువ్రాలకుండెను భరింపగరాని విచారవహ్నినన్
దెప్పరమై దహించెడుమతిభ్రమ కల్గెడునిక్క మేదియో
ముప్పుతటస్థ మయ్యెబదముల్ చలియింపవు పోవుటెట్లొకో.

శత్రు—పెద్దవాడవు.నాకు ధైర్యము గొల్పుటకు మారుగ నీవే అధై
ర్యపడిన నేనేమి చేయుదునన్నయ్యా ?

రాము—తమ్ముడా ; నడువుము. ఇపుడు మనము పురబాహ్యసీమ
వీడి పురములోనికి బ్రవేశించుచున్నాముకదా ?

శత్రు—అవును, (అటుచూచి)ఔరా ; ఇదేమి యాశ్చర్యము!రాచ

బిడ్డలమైన మనలజూచియు నీపౌరులెంత నిర్లక్ష్యముగ నావల
మొగంబై ఎవరినో తిట్టుచు కోపరసంబు నొలికించుచున్నారే!

భరత:—తమ్ముడా ; ఆ తిట్లు ఎవరినోకాదు. మనలనేయని తలంచె
దను. మనకు దెలియని దోషమేదో మనయందున్నది. వారి
ని బిలచి పురవృత్తాంత మడుగుదమా ;

శత్రు—వలదువలదు. యుక్తాయుక్త వివేకశూన్యుల వలె దోచువీరి
తో మనము ప్రస్తాపింపరాదు.

భర—ఔనదినిశ్చయమె, కానితమ్ముడా ;

ఉ॥ హల్లకతోరణంబుల మహోన్నత హర్మ్యములన్ మణిప్రభా
సల్లలితాంగనామ్ములను చక్కగమిర్ంచు నయోధ్యపట్టణం
బెల్లవిధాల స్వర్గమున కెక్కుడునై విల సిల్లినేడహా
తెల్లని సుద్దముక్కవలె దిస్సగనున్నది దేమిదైవమా.

శత్రు—అన్నయ్యా ; మనల జూచి ఏదో అప్రియము జెప్పజాలక
ఆవల కేగినట్లు కొందఱును, అసహ్యపడి తొలగిపోవువారు
కొందరును కనుపట్టుచున్నారు. మనమెవ్వరి వంకను జూడక
తొలుత కైకమాంబగారి గృహమున కేగుదము. రిమ్ము.

(తెరలేవగా కైకభవనము కనుపడును)

భర—తమ్ముడా ; మాతల్లి మందిరము కూడ కళాహీనమై దైన్య
మును సూచించు చున్నదికదా ;

లక్ష్మ—ఇకేమున్నది. ఈవిపత్తు మనయింటనే తటస్థించినది.

కైక—(ప్రవేశించి)నాయనా ; భరతా ; వచ్చితివా, మేనమామలకు
సేమమా?

భర—అచ్చట సేమమునకేమికాని మాతండ్రిగారికి సేమమా?

కైక—అయ్యో, నాయనా ; ఇంకెక్కడితండ్రిరా ;

భర—ఆ, ఆ, ఏలాగున్నారు?

కైక—ఆయన స్వర్గస్థులైనారురా; తపయా!

భర— హా జనకా! } మూర్ఛిల్లుదురు.
శత్రు—హా తండ్రీ!

కైక—బిడ్డలారా; రెండు. ఊరడిల్లుడు. కాలగతి ఇట్లున్నది. ఎవ్వరేమి సేయగలరు?

భర—హా! తండ్రీ సుతవత్సలా;

చం. అసురులదుంచి యాయనిమిషావళికి జయమిచ్చినట్టి యో
యసదృశ విక్రమాఢ్య జనకా ; మము నెవ్వరికప్పగించి యీ
వసుధ ద్యజించి స్వర్గసుఖవైభవమందగ బోయినావు నీ
నిసువులకేది దిక్కిక మనీషివరేణ్యమ కీర్తిమండనా.

శత్రు—హా, జనకా ; జనకా ;

చం. ఒకనిముసంబు గన్పడక యుండిన మమ్ముల బిల్వబంచి కౌ
తుకమున మాదుచుంచులను దువ్వుచు ముద్దులనాడి చేలచే
మొకముల చెమ్మటల్ దుడిచి ముచ్చటలాడెడు వాడవీవు మా
కికగలనైతివా : జనక ; ఎవ్వరిదిక్కుగ జేసిపోయితే.

కైక—బిడ్డలారా; లోకంబున దండ్రిలేని వారికెవ్వరు దిక్కయినారో మీకును వారేదిక్కు. విచారింపకుడు.

భర—అమ్మా ; మాతండ్రిగారి నేవ్యాధిమిగింగివైచినది?

కైక—బిడ్డా ; వ్యాధిఏమియు లేదు. మనోవ్యాధి యే కారణము.

శత్రు—ఏమీ, మేము నల్వురము పుత్రులుండ సామ్రాజ్యనకు మనోవ్యాధికి గారణమేమి ?

కైక—అదంతయు బక్షపాతము వలన కలిగినమనోవ్యాధి.

భర—అ, ఆ, ఆమహాత్మునకేమి ; పక్షపాతపుబుద్ధియేమి ; యిట్టి దోషమా ఘనునియం దెవ్వ రారోపించినారు.

కైక—ఎవ్వరికేమి పుట్టిమునిగినది ? ఆయన స్వబుద్ధి యట్లు చేసెను.

భర—అయన యేమిచేసెను.

కైక—మీరిద్దరు పురమున లేనిసమయమున రామునకు రాజ్యపట్టాభిషేకము సేయదలపెట్టినాడు.

భర—అదియుక్తమే ; అయ్యది పక్షపాతమెట్లైనది?

కైక—నీతెలివి తెల్లవారినట్లేయున్నదిలే ;

భర—ఊఁ, తరువాతనేమి జరిగినది ?

కైక—రాము డరణ్యావాసమున కేగ వానివియోగము సహింపలేక ప్రాణములవిడచినాడు.

భర—ఏమీ ; శ్రీరామున కరణ్యావాసమా ; అదిఎవ్వరునిశ్చయించినారు.

కైక—మీతండ్రిగారు చేయు పక్షపాతము నెఱింగి నేనే మున్నెన్నడో నాకు రెండువరంబుల నిచ్చి యుంటచే నవి యిప్పుడు చెల్లించెదరాయని యడిగితిని. అట్లేతప్పక చెల్లించెదనని బాసచేసినారు.

భర—నీవుకోరిన వరములెట్టివి?

కైక—భరతునకు యౌవరాజ్య పట్టాభిషేకము, రామునకు బదునాల్గేడులరణ్యా వాసమును.

భర—అట్లైన మాయన్నయిపుడు పురమునలేడా?

కైక—నేడు లక్ష్మణునితోడను భార్యతోడను అరణ్యా వాసమున కేగినాడు.

భరతుడు—

శా. ఓసీయెంతటి దారుణంబునకు నుద్యోగించినావే; మహో
ల్లాసుఀ శ్రీపతితుల్యు సర్వజనకల్యాణ ప్రదుఀ రామునిన్
గాసింబెట్టు నరణ్యవాస విధిశిక్షాపాత్రునిం జేసితే
ఛీ, సిగ్గింతయులేదె;నిల్వమిదె నీశీర్షంబునుఀ ద్రెంచెదఀ.

శతు్రి—(వారించి)అన్నయ్యా! శాంతింపుము. శాంతింపుము. అమ్మ భర్తృహంతకు గారణ భూతురాలైనట్లే నీవును మాతృహంతకు గారణంబవగుదువా ;

భత—తమ్ముడా; ఇది మాతృహంత కాదు. దుష్టహంత.

కైక—శత్రుఘ్నా : ఏల వారించెదవు. యావరాజ్యమును సమకూర్చి యరచేతబెట్టిన తల్లినిట్లు చంపవలసినదే.

భర—ఓసీ, భర్తృహంతకీ; నీవు నాకు దల్లివికావు.

చం. వరముల పేరుపెట్టుకొని భాస్కరవంశపుబూవుదోటని
ర్భరముగగాల్చివేయుటకు వచ్చిన వహ్నికణంబవీవుసు
స్థిరయశుఁడైనరాఘవుని సీతనుకానలపాలుచేసిభూ
వరుడగుభర్తప్రాణములబాపిన పాపినివీవుతల్లివే.

కైక—(స్వ) వీని యాగ్రహము కొంతచల్లారువఱకును నేను ప్రత్యుత్తరంబీయరాదు.

భర—హా, రామా, రఘుకులసోమా; తల్లీ, జానకీదేవీ; హా, భ్రాతృవత్సలా లక్ష్మణా;మీకందఱకెట్టిదుస్థితినిజేర్చెనదో, యీపాపిష్ఠి కైక. ఈదుష్టచిత్త భరతునకు రాజ్యాభిషేకమును, నీకు వనవాసము అను రెండువరములను కోరినప్పుడు ఉన్నత గుణసంపదగలిగిన పురుషోత్తముడవగుటచే నీవువిజ్ఞానభాజనంబగుటచే జానకియునామనంబెఱిఁగియుంటచే మీరు నన్ను నిందింపకపోవచ్చును ఈ పరుషాక్షరముల విని సంతనే భరతుఁడే తల్లి చేతనిట్లడిగించినాడని పౌరులు నన్నెంత నిందించిరోకదా ! కటకటా ! ఈ నింద నే నెట్టు లోర్చెదను. అన్నా ! శ్రీరామా; నీచరణరాజీవసేవలేక నేనొకత్రుటికాలమైన బ్రతుకుదునా; అన్నన్నా; పూజ్యుఁడైన వసిష్ఠుడైననాతల్లిదుర్వృత్తి మాన్పింపలేక పోయినాడు కదా!ఈ యవివేకిని మాటలపాటిచేసి నీవు భరింపదగిన సామ్రాజ్యమును నాకువిడచిపెట్టి నీవరణ్యముల కేగజెల్లునా;అన్నా;నీవు

లేనివైకుంఠపదంబునైననేను స్వీకరింతునా! రాజ్యభోగముల త్యజించి అరణ్యముల బట్టివచ్చి నీవువలదన్నను నీసేవజేయుచు గాలము గడిపెదను గాక !

కైక—భరతా: ఏలనీకిట్టి వైరాగ్యము; నీబుద్ధిపురువుమేసెనా; రాజులయొక్క సంగ్రామములు రక్తపాతములు, సామ్రాజ్యమునకుఁ గాదా; అట్టిశ్రమసుంతయు లేకుండ రాజ్యంబునీకు సమకూర్ప జ్వరపీడితునకమృతముంబలె నీకు చేవయ్యెనా; ఎక్కడియన్నలు? ఎక్కడితమ్ములు? ఎవరిసుఖమువారిదే. నీవికనైన దెలివి తెచ్చికొని రాజ్యమును స్వీకరింపుము. శైలకటాహమున నీవు వచ్చువరకు నిక్షిప్తంబు సేయుబడిన నీతండ్రి దేహమున కగ్ని సంస్కారము సేయుము. దుఃఖమును విడువుము. రామునియందు ప్రేమంబును ద్యజింపుము.

భర—ఛీ, ఛీ, దుష్టాత్మురాలా; ప్రేలకుము. నాకంఠంబున బ్రాణంబులున్నంతవఱకు రామునిపై భక్తి మానువాఁడనుకాను. నేను రాజ్యంబునేలువాఁడనుకాను. ఈసామ్రాజ్యమంతయు నరాజకమై తగులుబడిపోయిన పోవుగాక ! నేను స్వీకరింపను. ఇది నిశ్చయము. నీవికనాతో మారుమాటాడకుము. తమ్ముడా; శత్రుఘ్నా; ఈ వినిందితదుశ్చరిత్ర కైకవలన నేను కౌసల్యాదిమాతల హృదయకుటీరములకు పుత్రవియోగ శోకాగ్ని నిరగుల్కొల్పినవాఁడను. మన మిప్పుడా పూజ్యురాండ్రను సందర్శించి చరణములవ్రాలి నేనే దోషమునెఱుంగనని ప్రమాణములు చేసితండ్రిగారిసంస్కారాదులనిర్వర్తించి తక్షణమ మయరణ్యమున కేగి యాలోకసన్నుతుని రాముపాదముల కెఱగి యందే వసింతము. రమ్ము. ఈ పాడు వడిన అయోధ్యయిక గంగలో కలియు గాక !

శత్రు—అన్నయ్యా ; అటులే సేయుదము. నడువుము.

(తెరపడును)



# శ్రీ రామపాదుకా పట్టాభిషేకము.



## సప్తమాంకము.

రంగము, చిత్రకూటము.

—:o:—

(సీత—రాముఁడు—ప్రవేశించెదరు.)

రాము—జానకీ ;

చం. అమలమణీఘృణీలసితమైపలురంగులనీనుసాను పుం
జములను గల్గియుంటగదు సౌఖ్యదమై తనరారచిత్రకూ
టమనప్రసిద్ధిగాంచెను విటంకములం జెలువారిఖామహేం
ద్రముగనుగొంటివే జనకరాజత నూభవవెంతచిత్రమో.

సీత—నాథా : నానామణివిలసితంబౌటచే మీరు దీనినింతగా స్తుతించుచున్నారు. కాని మనమింతకు మున్నుచూచిన అగస్త్య వాల్మీకాశ్రమములు రెండు సౌఖ్యమొసంగువిషయమున దీనికి దీసిపోవునా ?

రాము—ఔనా పుణ్యాశ్రమము లట్లుండుట సహజమే. అట్లయిన వాల్మీకిమహర్షిని సందర్శించుటకు మున్ను మనము కాంచిన శ్యామవటమున్న స్థలము మాత్రముసుఖప్రదముకాదా.

సీత—ఆర్యా: ఆశ్యామవటమే యననేల? తొలుతతమసా నదీతీరమున పౌరులతో విడిసిననాటి మఱ్ఱియు బిదప మీరునాథుడు లక్ష్మణుడును బాల జడలతోనలవరించిన న్యగ్రోధవృక్షమును తరు

వాత గంగానదిని దాటుటకై వచ్చి గుహునికొరకై వేచియు
న్నవటవృక్షములును, మాత్రము సుఖప్రదములు కావా !

సీత—ఔ నందులకే నేనట్లంటిని. మీరనుగ్రహించినన్ను వెంటగొని
వచ్చుటచేతకదా ! ఇట్టివిశేషస్థలంబుల జూడగంటిని.

రాము—ప్రియురాలా : అగును. ఆవంకజూడుమా ;

గీ. కెంపుదళములగతినిరక్తమసుమములఁ
విఱియబూచిన పాలాశవిటపిపంక్తి
యల రెవ దెబ్బుతుస్నాతవై యలంక
రించుకొన్నట్టిలలనగీతిగనుమా.

సీత—(తలవంచియూరుకొనును.)

రాము—దేవీ ! ఏమి యూరకుంటివి. శృంగారరసమును స్మృతికిదెచ్చి
తిననియా ! పోనిమ్ము. ఆకేవజూడుమా ;

గీ. హితులనో హితురాలనో ఎందొ బాసి
దుస్సహవియోగవహ్ని చేదుఃఖపడెడు
సట్లుకువకువరవళిచే వల్లదిఱుగు
భరతపక్షినిఁగాంచితే ధరణిజాత.

సీత—ప్రాణేశ్వరా! మీరందులకు జాలిపడుచుంటిరా ! ఈపులుగుభ
రతశబ్దధారియగుటచే నీనికట్టియనుభవము కావలసినదనియేనా
తాత్పర్యము.

రాము—దేవీ ! నీవట్లనవలదు. ఇప్పుడీ పులుగు ఎట్లువగగుందుచున్న
దో నావియోగమునకై నాతమ్ముఁడు భరతుఁడును అట్లుదుర
పిల్లువాఁడుసుమీ ?

లక్ష్మణుఁడు॥ (ప్రవేశించి) అన్నయ్యా; మీరిందువై దేహీరక్షణమునసే
మఱక యుండుడు. నేనుధనుర్బాణంబుల ధరించి యుద్ధమునకేగు
చున్నాను. వేగననుజ్ఞనిండు.

రాము—తమ్ముడా; ఎవరిమీఁదికి, యుద్ధమున కేగుట?

లక్ష్మ—మనశత్రువులి మీఁదికి.

రామ—మనకు శత్రువెవ్వఁడును లేడే; ఆ వచ్చినవాఁడెవ్వఁడు?

లక్ష్మ—వెఱ్ఱియన్నా! ఇంకను సాత్వికగుణమేనా?

సీ. సకల సర్వంసహా సామ్రాజ్యము హరించి,
దొరయైన వాఁడు శత్రువుఁడు కాఁడె
మనయన్నమైనను దినకుండపురినుండి
తోసినవాఁడు శత్రువుఁడు కాఁడె
నారచీరలొసంగి ఘోరాటవికిసాగ
దోలినవాఁడు శత్రువుఁడు కాఁడె
అంతటదనివోక హాతమార్పగాసేన
తో వచ్చువాఁడు శత్రువుఁడు కాఁడె,

రాము—

గీ. మనల నావిధిచేసిన మత్తుఁడెవఁడొ
వానిపేరేదొ చెప్పుమా వాదమేల?

లక్ష్మ—

ఎఱుఁగవాయన్న! మనల సమరమునందు
నెదురుకొనవచ్చె భరతుండు మదమడంతు.

రామ—ఏమీ, భరతుఁడా! మనతో సమరమొనర్ప వచ్చుచుండెనా?

లక్ష్మ—అగును.

రామ—నీ వెట్లెరింగితివి?

లక్ష్మ—నేనా యున్నత వృక్షాగ్రమునెక్కి చూచితిని. భరతుని గుర్తించితి.

రామ—అతను మనమీఁదికి యుద్ధమునకే వచ్చుచున్నాఁడని నీ వెట్లు తలంచితివి?

లక్ష్మ—సేనలతో వచ్చుచుండుటచేత.

రామ—అట్లుకాదు. భరతుడయోధ్యకేగి కడచిన వృత్తాంతమునం తయువిని మిక్కిలివిచారించి తల్లిపై నాగ్రహించి నన్నుసేవిం చెదనని వచ్చుచుండ దండ్రిగారు ఆతనివెంట బరివారమును బంపియుండవచ్చును. అంతియేకాని అతడు ద్రోహబుద్ధితో సమరమునకు వచ్చుచుండుటలేదు. నాయందు మిక్కిలిభక్తి విశ్వాసములు కలిగినవాడు. రాజ్యమునన్నేలుకొమ్మని ప్రార్థిం పవచ్చుచుండును. ఇదినిక్కము.

లక్ష్మ—ఏమో; నాకామాటయందు విశ్వాసములేదు. కైకసుతుడు కాడా భరతుడు?

(భరతుడును వశిష్ఠులును ప్రవేశించెదరు.)

భర—

గీ. శరణు శ్రీకర రఘురామ శరణు శరణు
శరణు దాసజనావన శరణు శరణు
శరణు దశరథవరపుత్ర శరణు శరణు
శరణు సీతామనోహర శరణు శరణు

రామ—తమ్ముడా; అభయమోస్తు. లెమ్ము. లెమ్ము.

ఉ. ఏటికిరాజ్యరక్షణము నేమరివచ్చినవాడ విట్టి ఘో
రాటవి కేలనర్థ శరణమంచనినేడ ననార్యకార్యమే
నాటనెఱుంగవే పురజనంబులు దల్లులుదండ్రి సేమమే
యోటమి నీకదేల సుగుణోన్నత తెల్పగదయ్య తమ్ముడా.

అంతియేకాక నాసేమమారయవచ్చితి నందువా? ఏచారునైన బంపిన మాసేమమునీవు దెలియందునా? ఇంతశ్రమనందనేల?

భర—(దుఃఖించును.)

రాము—తమ్ముడా; ఏమిదుఃఖించుచుంటివి? తండ్రిగారికి సేమమా, తెల్పుమా?

భర—అన్నయ్యా!

చం. మనలనుగన్నతండ్రి పెరిమంబున బెంచినతండ్రి యంకమం
దున నిడుకొన్నతండ్రి మెయిధూళిని దుల్పినతండ్రి చుంచుదు
వ్వినమనతండ్రి ముద్దులనుబెట్టుమటంచును గోరుతండ్రి య
క్కున గదియించుదండ్రి మనకుంగఱవయ్యెగదయ్య ధుగ్రిజా

రాము—హాజనకా!
లక్ష్మ—హాతండ్రీ!
సీత—హాదశరథమహీరమణా!
} మూర్ఛిల్లుదురు.

వశిష్ఠు—రామలక్ష్మణులారా జానకీ; ఊరడిల్లుడు. లెండు.

రాము—ఆచార్యా! మాకెట్టు లూరట కల్గును?

చం. అమరనిభుండునై సుతులనందమి చింతిలిచీకి పెద్దకా
లము వ్రతమాచరించి సుతులన్ మమునల్వర గాంచినందుకా
యమల చరిత్రుడస్తమయమందెసువేళకు మేముచెంతనుం
డమికె విచారవహ్నియకటా! దహియింపగ నోర్చుటెట్లగున్.

లక్ష్మ—హాతండ్రీ! దశరథమహీపాలా; మమ్ము దండ్రిలేని బిడ్డలగా
జేసితివా?

చం. కరుణయు హర్షముల్ బొదలగా వికసిల్లెడునీదుమోము దా
మర దిలకించుభాగ్యదశ మాకికలేదో! విధాతృడెట్టి ని
ష్కరుణుడో నేమదెట్టి కలుషంబొనరించితిమో ప్రియంబుచే
గరములమాళిజేర్చి జనకాయని పిల్వకయుండ జేసితే.

సీత—హా; స్నుషాభిమానీ!

శా. అమ్మాజానకి; ఏపనుల్సలుపకమ్మా చేటులున్నారు కా
ర్యమ్ముల్ సేయగ నీకదేలశ్రమ మా పాగ్యపుణ్యముంజేసినీ
విమ్మై కోడలవైతి వింద్యిరవుకావే! తల్లియుంచెంతొ ప్రే
మమ్మున్ జూపెడువాడవీవు గుణధామా మమ్ములన్ బాసితే.

వశి—జానకీ; యూరడిల్లుము. ఆమహాత్మునియమానుషసుగుణ రత్నం బులుమఱచినను మరపునకురావు. గతించినవారికై పలవించిన నిష్ఫలంబు. లక్ష్మణా! దుఃఖమునుదిగమ్రింగుము. రామభద్రా; విజ్ఞానమూర్తివై యుయ్య నీవిట్లుశోకింపరాదు. కాలగతినతిక్ర మింప బ్రహ్మాదులకైన వశముకాదు. మఱియు కైక యిట్టి వరముల గోరుట ఈభరతుఁడింతయు నెఱుంగడు. పిదప సర్వ మునెఱింగి శోకించి తల్లినిదూఱి నాకిక రాజ్యముతో నవసర ము లేదని నీపాదము లాశ్రయింప వచ్చినాఁడు. నిర్దోషియైన నీతమ్ముని భరతుని గటాక్షించుము.

భర—అన్నా, శ్రీరామచంద్రా!

చం. ఎఱుగను కైకకృత్యము నొకింతయుదైవముసాక్షిగాగ నా
తరణికులీనుఁడౌ దశరథక్షితిపాలుని తండ్రిసాక్షిగా
నెఱుగ మహేశుసాక్షిగ ద్విదీయపదంబుల సాక్షిగా మహీ
భరము భరింపజాలమిము బాసివసుంధరనన్ను నేలుమా.

రామ—తమ్ముఁడా; నీవాయంశము నెరుంగనిమాట సత్యమే. నీసుగు ణంబు నేనెఱుంగనా ; అయినను నేనీవ్రతమును మాని మరల పురికిరారాదు. వరము లిచ్చినవాఁడు తండ్రి. వరములఁ గొన్నది తల్లి. ఈ యిరువురి యభీష్టములను దీర్చుట తనయుఁడనైన నాకు విధినిర్ణయము. అందువలన గుర్వాజ్ఞా పరిపాలనము సేయుదునని కంకణము గట్టుకొని అరణ్యమునకువచ్చి మఱల నీవుకోఱినంతనే తిరిగి రాజ్యముబాలింప వచ్చుట యెంతయు నింద్యము. ఇందువలన మాయిువ్వురియొక్క ప్రతినలును భంగమునులగును. ఇంతకును రాజ్యపరిపాలనమునకుగదా నీవు రమ్మనునది. అదియెవరేలినను ప్రజాక్షేమమునకు గానిమన క్షేమ

మునకు గాదు. నీతల్లికైక మాంబ నీకుమేలును నా యసుఖము
ను గోఁటి ఇట్టివరంబుల నడిగెనని యల్పబుద్ధిచే నీవూహించినా
కేదో మనసున జింతయు గోపమును గలదనియెంచి నన్నిట్లు
ప్రార్థింపవచ్చితివి. నీవట్లెన్నటికిని తలంపరాదు. ఈవిషయమున
నీతల్లి నీమీఁదకంటె నామీఁదనే ఎక్కువ పుత్రవాత్సల్యత
చూపించినది. ఏమందువా?

గీ. అధికదుర్భరమైన రాజ్యభరమెల్ల
నీతలను బెట్టి కైకమ్మ నిర్దయతను
అతిసులభమైన గహనరాజ్యసుఖమెల్ల
నాతలను బెట్టి నాయందనంత కరుణ.

కావుననన్ను ఘోరారణ్య కష్టంబుల నందజేసెననియు, నిన్ను సుఖాస్ప
దమైన సామ్రాజ్యపీఠమునం దభిషేకించినదనియుదలంపకుము.
జనకాజ్ఞను దీరిచి త్వరలోవచ్చి నిన్నుగలసి కొందును.
నీవుసందేహింపక పురంబునకు బొమ్ము. అమ్మను నిందిపకుము.

భర—అన్నా; నీవుపూజ్యుడవగుటచే గష్టములనుసుఖములగా బరిణ
మింప జేసికొని యట్లుపలుకుచున్నావు. కులతిలకుండవు; అగ్రి
జుండవు, రాజ్యపరిపాలనా దక్షుండవు, నీవరణ్యంబుల గంద
మూలమ్ముల భక్షించుచు మునివృత్తిని జరింపుచుండ నేను
రాజ్యము నేలుదునా; అదివట్టిదిగల్ల. నాతల్లిఅవివేకిని దుష్టాత్ము
రాలై యట్లుకోరినది. నీవామాట పాటిచేసికొని రాజ్యమును
త్యజింపరాదు. కటకటా! యామె నాతల్లియనుటకుగూడసిగ్గగు
చున్నది. నీవు నాప్రార్థన మన్నింపుము. వచ్చిరాజ్యము
నేలికొనుము. నీవురాకున్నను,నన్ననుగ్రహింపకున్నను, నేనునీన

మీపముననే ఈయరణ్యమునసనే కాలము గడిపెదను కాని అయోధ్యలో నడుగు పెట్టజాల. రక్షింపుము. (పదముల పై వ్రాలును.)

రాము—తమ్ముడా! ఇది యేటియవివేకము. నీవు ప్రార్థించినంతనే, గుర్వాజ్ఞనతిక్రమింతుననుకొంటివా? చాలు. చాలు. నీప్రస్తావన నికవిరమించుము. నాపాదంబులవిడువుము. (వదల్చుకొనును.)

భర—అన్నా; నాప్రార్థనజెల్లింపవుగా; పోనిమ్ము. నీనిరాకరణముననో నాపూర్వపుణ్యముననో, నీపాదుకలునాకు జిక్కినవి. నీవురాకున్నను నీవరణ్యావాసము గడపి మఱల నయోధ్యకు వచ్చువరకును నీపాదుకలను సింహాసనమునందుంచి నేనయోధ్యలో బ్రవేశింపక నందిగ్రామమునసనే నీకు మారు రాజకార్యముల నెరవేర్చువాడ నందులకైన నంగీకరింపుము.

వశి—ఇదిమిక్కిలి సం స్తవనీయము.

రాము—తమ్ముడా; అట్లే సేయుదువుగాక, నీభ్రాతృభక్తియే నిన్నుగాపాడగలదు. పాదుకల గొనిపొమ్ము.

భర—

గీ. శ్రీకరాంఘ్రి సరోజ ధూళీకణమున
పాపముంబాపి రాతిని పడతిజేసి
నట్టి శ్రీరామపాదుక లహరహంబు
శిరమున ధరించి రాజ్యంబు సేయువాడ.

వశి—బహు బాగుగనున్నది. రామభద్రా! ఇంకనీయభిమతమేమి?

రాము—ఆచార్యా; ఇంతకంటె నాయభిమతమేమి. అయిననిట్లగుగాక;

గీ. ధరణి పితృవాక్యపాలన తనరుగాక
భ్రాతృవాత్సల్య మధికమై పరగుగాక

సజ్జనవిధేయ మాణిక్య శర్మకృతులు
విపుల ధర్మముదెలుపుచు వెలయుగాత.

వశి—తథాఅస్తు.

(అందరునిష్క్రమించెదరు.)

గద్య—ఇది శ్రీకాశ్యప గోత్రసంభవ చక్రావధాని వంశపయః పారా
వార రాకాసుధాకర నారసింహార్య తనూభవ నరసమాంబా
గర్భశుక్తిముక్తామణి శ్రీసామ్రాజ్యభువనేశ్వరీ కరుణా
కటాక్షసంపాదిత సాహిత్యవివిధనాటక రచనా
ధౌరేయ శ్రీ మాణిక్య శర్మవిరచిత
శ్రీ రామపాదుకా పట్టాభిషేక
నాటకము, సప్తాంక విశి
ష్టము, సర్వము,
సంపూర్ణ ము.

శ్రీశ్రీశ్రీ మంగళం శ్రీశ్రీశ్రీ.



# ఈనాటకమునవచ్చుసాంగులు.

(1) యమునాకళ్యాణి—ఏక—దశరథుఁడువిశ్వామిత్రునివేడుట.

పల్ల—భవ్యగణాభరణామునివరపాలింపవె కరుణా॥ కౌశిక ॥భవ్య॥

ఓపలేరుపసికూనలుదనుజుల।రూపడంపలేరునన్ను జేకొను ॥భ॥

చిరకాలతపశ్రీజనియించిన।చిరుతబిడ్డలను బాయగజాలను।

కరుణదలిర్పగవారివిడచినన్।గైకొనదగునీకుబుణ్యముంఁడును॥భ

(2) అహల్యాస్తవము—కాంభోజి—ఝంపె.

పల్ల—శ్రీరామగుణధామ। శ్రీభానుకులసోమ ॥శ్రీరా॥

నినుసన్నుతింపనాతరమా। రఘురామ ॥నిను॥శ్రీరామ

(2) నీపాదములధూళి। నాపాపమగలించి। రూపందజేసెగా ॥నహహా

నాపూర్వ। రూపందజేసె॥

(3) నారాయణుఁడవీవు। నాపుణ్యమునగంటి।

ఏరైననినుగాంచగలరే॥వందనము ॥శ్రీరామ॥

(3) నాదనామక్రియ—రూపకం—దశరథుఁడు కైకనుబ్రతిమాలుట.

పల్ల—న మనవినివిసరాదా :। నళిననేత్రవాదానాతో ॥నా మన॥

రాముసడవికంపమూని। రాజ్యముఃభరతునకు గొనుమ ॥నా॥

(2) వానివిడచిగడియయైన। బ్రతుకజాలవాదమేల

వేరువరముగోరరాదె। వేడెదనీపదములంటి ॥నా॥

(3) శంకరా భరణము—త్రిపుట—రాముఁడుదశ రథునోదార్చుట.

పల్ల—తండ్రి ; ఇంతాచింతిల్లా గానేల ॥తండ్రీ॥

తగునయ్యా ధైర్యంబును గనుమయ్యా ॥తండ్రీ॥

పదునాలుగేండ్లు తృటిలో।ముద మొప్పదీర్చి వచ్చేదాగనుమయ్య ॥తం॥

గాధిసుతుఁడుచేసెడు జన్నము । గావబోయివచ్చినరీతిగ ॥తం॥

బాధలేకయడవులదిమ్మరి। సాధుజనులబోచినకీర్తిగాంచెదనయ్య॥తం॥

(5) నాథనామక్రియ—త్రిపుట—సీతరామునితో

పల్ల—ప్రాణనాథా మిమ్మామబాసి । ప్రాణమూలానిల్వాగాజాలా॥ప్రా॥

# ఆంధ్రనాటకములు.

| | | |
|---|---|---|
| జ్ఞానకృష్ణలీల వ. కె. సు. | 1 | 4 |
| కన్యాశుల్కము గు. అ. | 1 | 0 |
| వేణీసంహారము. వ. సు. | 1 | 0 |
| రసపుత్రవిజయము. ఇ. య. | 1 | 0 |
| కంఠాభరణము పా. ల. | 1 | 0 |
| పాదుకాపట్టాభిషేకం. ,, | 1 | 0 |
| రాధాకృష్ణ, ,, | 0 | 10 |
| సారంగధర ,, | 0 | 9 |
| మణిమాల. వు. ఆ, | 0 | 10 |
| శాకుంతల. కం. వీ. | 0 | 12 |
| కనకతార. చ. కే. | 1 | 4 |
| కుశలవ. వి. సు. | 0 | 12 |
| సారంగధర. | 0 | 12 |
| కృష్ణలీల. ప. కె. సు. | 1 | 4 |
| లవకుశ | 1 | 4 |
| ప్రభావతీ ప్రద్యుమ్నము | 1 | 0 |
| సుభద్రార్జునీయము | 0 | 12 |
| పాండవజయము. తి. వె. | 1 | 0 |
| సత్యహరిశ్చంద్రీయము. | 1 | 4 |
| సత్రాజిత్తీయము. | 1 | 0 |
| ఉత్తరరాఘవము. | 1 | 4 |
| బుద్ధిమతీవిలాసము | 1 | 0 |
| రోషనార. | 1 | 0 |
| చింతామణి. కా. నా. | 1 | 0 |

| | | |
|---|---|---|
| వరవిక్రయము. కా. నా. | 1 | 0 |
| మధుసేవ. ,, | 1 | 0 |
| పద్మవ్యూహము. | 1 | 0 |
| రంగరాయకధనసమవాకార ము (బొబ్బిలి) కా. నా. | 1 | 0 |
| కన్యకాపరమేశ్వరీవిలాసం,, | 1 | 0 |
| సుగుణమణి. వ. శా. | 0 | 10 |
| పాల్ ఆఫ్ విజయనగరం | 0 | 10 |
| తులసిదాసు. | 1 | 0 |
| రామదాసు. | 1 | 0 |
| చిత్రనళీయము. ధ. కృ | 1 | 4 |
| విషాదసారంగధర ,, | 1 | 5 |
| పాదుకాపట్టాభిషేకం ,, | 1 | 3 |
| పాంచాలీస్వయంవరం ,, | 1 | 0 |
| మోహినీరుక్మాంగద ,, | 1 | 0 |
| చంద్రహాస ,, | 1 | 0 |
| బృహన్నల. ,, | 1 | 0 |
| ప్రహ్లాద. ,, | 1 | 0 |
| ముక్తావళి. ,, | 1 | 0 |
| చిరకారి. ,, | 1 | 0 |
| శ్రీరామాంజనేయము. | 0 | 10 |
| శ్రీకృష్ణసందేశము. | 0 | 12 |
| బొబ్బిలియుద్ధం. శ్రీ. కృ | 1 | 0 |
| శ్రీరామజననము. | 0 | 8 |

| | | |
|---|---|---|
| శ్రీరామప్రవాసము. | 0 | 8 |
| శ్రీరామఉద్యోగము. | 0 | 8 |
| శ్రీరామవిజయము | 0 | 8 |
| శ్రీరామఅశ్వమేధము. | 0 | 8 |
| 1 గయోపాఖ్యానము చిల. | 0 | 8 |
| 2 ప్రసన్నయాదవము ,, | 0 | 8 |
| 3 పారిజాతాపహరణము,, | 0 | 8 |
| పై మూడు పుస్తకములు క్యాలికో బైండు | 1 | 12 |
| సంగీతసత్యవిజయ మను హరిశ్చంద్ర చ. మా. | 1 | 0 |
| సంగీతసావిత్రి. ,, | 1 | 0 |
| సంగీతప్రహ్లాద ,, | 0 | 12 |
| భూలోకరంభ ,, | 1 | 0 |
| స్త్రీసాహసము. ,, | 0 | 10 |
| చంద్రకాంత. ,, | 0 | 10 |
| శ్రీకృష్ణరాయవిజయం,, | 0 | 12 |
| సంగీతశశిరేఖ. | 0 | 8 |
| సంగీతజయంతజయపాల. | 0 | 8 |
| సంగీతసారంగధర. | 0 | 8 |
| పండుగకట్నము పత్రిబంధము | 0 | 8 |

భోగరాజు, నారాయణమూర్తిగారు.

| | | |
|---|---|---|
| పాండవఅజ్ఞాతవాసం. | 0 | 8 |
| ఉషాపరిణయము. | 0 | 8 |
| హస్తినాపురం. | 0 | 8 |
| చతురచంద్రహాస. | 0 | 8 |
| ద్రౌపదీపరిణయము. | 0 | 12 |
| విజయబొబ్బిలి. | 0 | 12 |
| శ్రీకృష్ణతులాభారము. | 0 | 12 |
| ఆంధ్రపతాకము | 12 | 0 |
| గులేబకావళి. అ. సు. | 1 | 0 |
| జయచంద్రచంద్రరేఖావిజయము. | 0 | 10 |
| శ్రీకృష్ణవిలాసము. | 0 | 10 |
| ప్రతిజ్ఞాయాదవము | 0 | 10 |
| గర్వభంగము. | 0 | 10 |
| సంగీతసైంధవార్జునీయము. | 0 | 8 |
| సంగీతపాశుపతార్జునీయము | 0 | 8 |
| సీతాకళ్యాణము. | 0 | 8 |
| తులసీదాసు క్రొత్తది. | 1 | 0 |
| లోకాభిరామాయణము. | 0 | 6 |
| సంపూర్ణరామాయణము. | 1 | 0 |

కర్రా అచ్చయ్య అండు సన్సు,
బుక్ సెల్లర్సు
రాజమండ్రి.

శ్రీ సీతారామాంజనేయ ముద్రాక్షరశాల, రాజమండ్రి. 8-1927.